

# గ్రంథాలయసర్వస్వము.

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘపక్షమున ప్రకటింపబడు సచిత్రమానపత్రిక.

సంపు. ౯ | బెజవాడ జనవరి, 1934. | సంచిక ౧

సంపాదకీయవర్గము:

ఉమ్రీ అలీషా కవి
మంగిపూడి వేంకటశర్మ కవి
శనివారపు సుబ్బారావు.
ఊటుకూరి వేంకటసుబ్బరాయ గుప్త
జటావల్లభుల పురుషోత్తం, బి. ఏ.
తేకుమళ్ల రాజగోపాలరావు, బి. ఏ.
గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.
ముళ్లపూడి తిమ్మరాజు

అయ్యంకి వేంకటరమణయ్య,
ప్రధాన సంపాదకుడు.





వార్షికమూల్యము: సభ్యులకు రు 3-౦-౦;
ఇతరులకు రు ౪-౦-౦.
విడిసంచిక రు ౦-౫-౦.

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు క. కోదండరామయ్యచే ముద్రింపబడి ప్రకటింపబడినది.

# విషయసూచిక.




పరబ్రహ్మాత్మికాం దేవీం ♦ భుక్తిముక్తి ఫలప్రదామ్,
ప్రణమ్య స్తౌమి తామేవ ♦ జ్ఞానశక్తిం సరస్వతీమ్.

౯-వ సంపుటము.

# గ్రంథాలయ సర్వస్వము.

౧-వ సంచిక.

జనవరి, 1934.


## సరస్వతీ దేవి స్తుతి.

శ్లో॥ యా కుందేందు తుషార హార ధవళా యా శుభ్ర వస్త్రాన్వితా ।
యా వీణా వర దండ మండిత కరా యా శ్వేత పద్మాసనా ।
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభి ర్దేవై స్సదా పూజితా ।
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా ॥

శ్లో॥ సరస్వతీం సమాశ్రయే సరోజ పీఠ వాసినీం ।
సదా సదాదరాం ముదా సరోజ పీఠ గేహినీం ।
సువీణయాఽక్షమాలయా సుపుస్తకేన శోభినీం ।
సురేంద్ర బృంద వందితాం సుధాకరావతంసినీం ॥

కమాసు రాగః ] సరస్వతీ కృతిః [ ఆదితాళః

సేవేసేవే॥ దేవి సరస్వతి॥ సేవేసేవే తవ పద మహ మిహ॥ సేవేసేవే॥ సం॥

౧. సేవక జనతా - దైవత భూజం । దేవ నతం నిఖి - లార్థసుబీజం॥ ॥సేవేసేవే॥

౨. మాధవ భగవతి - మహాసరస్వతి । సోమ వతంసిని - సుగుణ విలాసిని ॥సేవేసేవే॥

3. జపవర పుస్తక - సద్వీణాఢ్యే । కృపయా పహ మాం - కృతి రత్నాఢ్యే ।సేవేసేవే॥

# ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్ర

[ గంజాం - విశాఖపట్టణ మండలముల గ్రంథాలయ మహాసభకు, అధ్యక్షులగు అయ్యంకి వేంకటరమణయ్యగారి ప్రారంభోపన్యాసము ]



గంజాం - విశాఖపట్టణ మండలముల గ్రంథాలయ మహాసభకు నన్ను అధ్యక్షత వహింపుమని యడుగుట తోడనే నాకాశ్చర్యము గలిగినది. ఇది నాయకు లాక్రమింపవలసిన స్థానము కాని నాబోటి గ్రంథాలయ సేవకు డాక్రమింపవలసినది కాదు. అయితే ఈ మండలముల గ్రంథాలయోద్యమమునకు అగ్రసేవకులగు శ్రీ తితి బలరామయ్యగారు ఈ అధ్యక్షపదవిని వహించుటకు తనబోటి సేవకునే సూచించుట తన సేవయందు వారికిగల గాఢాభిమానమునే సూచింపుచున్నది. నేనెల్లప్పుడును సేవకులలో నెల్ల అగ్రసేవకుడనై యుండుటకే వాంఛించుచుందును. అట్టి అగ్రసేవకునకు మీ యందరికంటె ఉన్నతాసన మొసంగుట భావ్యము గాదు. అయితే ఈ గౌరవము నాకు వ్యక్తిగతముగా గాక నేనేసేవజేయు గ్రంథాలయోద్యమమున కొసంగబడినదని పరిగణించి మీ యాహ్వానమును శిరసావహించితిని. కావున నేజెప్పు విషయములందుగల లోపములను మన్నించి యొప్పులనే స్వీకరించెదరని దోసిలొగ్గి ప్రార్థించుచున్నాను.

## ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము స్వయంభువు

వ్రతములలో నెల్ల నేది ఉత్తమము అని నిరంతర వాగ్వివాదములు జరుగుచుండును. ఇపుడు మన మాలోచింపవలసినది ఉద్యమములలో నెల్ల నేది ఉత్తమము అను విషయము. ఏవ్రత మాచరించినను మోక్షప్రాప్తిని జెందుట కేమియు అభ్యంతరము లేదు. కాని ఆయా వ్రతములందు తారతమ్యము లుండును. అందులో పిల్ల వ్రతము లుండును. తల్లివ్రతము లుండును. తల్లివ్రతములో పిల్లవ్రతము లన్నింటికిని ప్రాతిపదిక లుండును. అదేరీతిని, ఉద్యమములలో నెల్ల మూలకందముగ నున్నది, ఉద్యమము లన్నింటికి జీవదాయకమైనది, ఉద్యమము లన్నింటికి జ్ఞానదాయకమైనది గ్రంథాలయోద్యమము.

ఇన్ని గర్భితశక్తులు గల ఈ మహోద్యమము ఆంధ్రదేశమునం దెట్లు ఉద్భవ మందినది? ఎప్పుడు ఉద్భవ మందినది? అను విషయములను పరిశీలింపవలయును.

అభివృద్ధిదాయకములగు విషయము లన్నియు పాశ్చాత్య సంసర్గము కలిగిన పిమ్మటనే మనదేశమున ఆవిర్భవించినవని మనలో చాలమందియొక్క భావము; దానియొక్క సత్యాసత్యములను చర్చించుటకు నే నిప్పుడు పూనుకొనలేను. అయితే గ్రంథాలయోద్యమమునకు మాత్రము ఈభావము బొత్తిగా అన్వయింపదని మాత్రము ఘంటాపథముగ జెప్పగలను.

ఆంగ్లేయ భాషాసంసర్గము, ఆంగ్లేయ సంప్రదాయ సంసర్గము ఏమాత్రమును లేని వ్యగ్రోత్సాహులగు యువకులవలననే ఈ యుద్యమము ఆంధ్రదేశమున జనించి వ్యాపించినది. అందుచేత ఈయుద్యమము "స్వయంభువు" అని చెప్ప సాహసించుచున్నాను. స్వయంభువు అనగా ఇతరులచేత బయలుదేరదీయబడినదిగాదు, తనకు తానే అవిర్భవించినది.

## ఆంధ్రగ్రంథాలయోద్యమాదర్శము

ఆంధ్రదేశమున బయలుదేరిన ఈ వందలకొలది ధర్మగ్రంథాలయములను స్థాపింపవలెనని ఎవ రుపదేశము చేసిరి? ఈ సంఘముల స్థాపించిన వారలెవరు? దొరతనమువారివలన బిరుదములను సంపాదించు ఆశయా వీరికి ఈ యుద్యమమందు అభిరుచిని గల్పించినది? ధనవంతుల మన్ననల నా ఈ యుద్యమము బయలుదేరినది? లేక దరిద్రులయొక్క ద్రవ్యాభిలాషయా

ఈ యుద్యమమునకు కారణము? ఈ గ్రంథాలయస్థాపకులకును సంరక్షకులకును ఈ యుద్యమవిషయమై పూనుకొనుటకు ప్రేరేపించినమహాశక్తి యేది? ఇందుకు ప్రతిఫలముగ ఈ యుద్యమసేవకులు బడయగోరు మన్నదియేది! వీరు వాంఛించు ఫలమేమి! ఈ యంశములను గూర్చి కొంచెము ఆలోచించినయెడల ఆంధ్రదేశగ్రంథాలయోద్యమముయొక్క స్వరూపస్వభావములు కొంతవరకు బోధపడగలవు.

ఈ యుద్యమమునకు ప్రేరకులు తాము బాగై తమ తోడివారలను బాగుచేయవలెనను మనుష్యస్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛయే. ఈ యుద్యమ ప్రచారకులు కోరుఫలము తమకును తమతోడి వారికిని జ్ఞానాభివృద్ధివలన పొందెడు ఆనందమే. ఈ యుద్యమమునకు పురికొల్పు మహాశక్తి ప్రపంచాభివృద్ధికొఱకు అప్పుడప్పుడు ఆవిర్భవించు మహోద్యమములను మేలుకొల్పి, వానికి జీవసత్త్వములను గల్పించు ఈశ్వరప్రేరితశక్తియే. ఈ యుద్యమ ప్రచారకులు తాము ఈశ్వరప్రేరితులమనియు ఈశ్వరదత్తమగు కార్యములను తాము నెరవేర్చుచున్నామనియును దృఢతరవిశ్వాసపూరితులై యున్నారు. ఈ యుద్యమము ఇతర ఉద్యమములవలె మూడునాళ్ళముచ్చటతో బోవునది గాదు. ఇది నాయకుల యధీనమునందున్న యుద్యమమును గాదు. గ్రంథాలయములు తాత్కాలికముగ ప్రారంభించి, స్వల్పకాలము జరిపి, తరిగి మూలబడునవి కావు. వానియందు సంవత్సరము పొడుగునను పని జరుగుచుండును. నవోత్సాహపూరితులైన యువకులే ఈ యుద్యమమునకు మూలకారకులై యున్నారు.

ఏ యుద్యమమైన సరియైన మార్గముల నవలంబించి, అంగులకు నిర్ణీతమగు పనిని నిర్వర్తింపవలెనన్న ఆ యుద్యమకర్తలకు, అందలి ప్రాశస్త్యముల స్వరూపస్వభావములయొక్కయు, ఆ యుద్యమమునకును తోడి యుద్యమములకునుగల యన్యోన్యసంబంధములయొక్కయు జ్ఞానము దృఢముగ నుండి తీరవలయును. ఏయుద్యమమునకైన ఆదర్శమే ప్రాణము. ఆదర్శము లేని యుద్యమము ప్రాణములేని రూపము. ఆదర్శము లేని యుద్యమములు వృద్ధి బొందవలెనన్నచో, తమయందు స్వాభావికముగా నున్న జవసత్త్వములవలన గాక, సతతము పరాపేక్షను బొందియుండును. [illegible] వచ్చు సహాయమెప్పుడు తగునో, అట్టి యుద్యమమప్పుడే భగ్నమైపోవును. ఇట్లుగాక ఆదర్శముతో గూడిన యుద్యమము ఈశ్వరనిర్మితమగు సంపూర్ణసౌష్ఠవముతో గూడిన జీవికవలె దినదినాభివృద్ధి గాంచును. ఆదర్శముయొక్క శక్తి వర్ణింపనలవిగాదు. అది మహత్తరము. ఆదర్శము నేకాగ్రచిత్తతతో ధ్యానము చేయుచుండినయెడల, కార్యాచరణయందు వచ్చిన కష్టములన్నియు సుఖములుగా పరిణమించి, కార్యదీక్షను ప్రజ్వలింపజేయును. కావున ఈ యుద్యమముయొక్క ఆదర్శమును బాగుగా గుర్తెరుంగవలెను.

ఇతరదేశము లన్నియు మనుజుని మేధాశక్తిని వృద్ధి నొందించుటకే ప్రయత్నము లొనర్చుచుండ ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమున మనుజుని సంపూర్ణమానుష్యత్వమును వ్యక్తీకరించుటకు తగిన సాధనావలంబనమంతయు చేరియున్నది. కావుననే మన ఉద్యమముయొక్క ఆదర్శము దేశమునందు జ్ఞానాభివృద్ధిని గలుగజేసి, మనుజుని జీవయాత్ర పవిత్రవంతముగను పురుషార్థసాధకముగను చేయుటయే యైయున్నది. మన మొసంగుజ్ఞానము నిద్రాణమైయున్న ఆత్మ నుద్దీపింపజేసి, పౌరునికి కావలసిన సన్మార్గజీవనమునకు గొనిపోవునదిగ నుండవలెను.

## అనుకరణముగా నుండరాదు

ఈ ఆదర్శమును ఎల్లప్పుడును దృక్పథమునందుంచుకొని, ఈ యుద్యమము పేరట జరుగు ప్రతి పనియు ఈ ఆదర్శమును కార్యరూపమున పెట్టుటకు తోడ్పడుచున్నదియు లేనిదియు తెలిసికొనవలెను? ఈ ఆదర్శము కార్యరూపము దాల్చవలెనన్నచో, మనము అవలంబింపవలసిన మార్గములు కేవలము అనుకరణరూపమున నుండగూడదు. పాశ్చాత్యదేశములయందలి ఉద్యమములను ఉన్నవి యున్నట్లు మనదేశమున నాటుటకు ప్రయత్నించినయెడల, మన దేశమునందలి వృద్ధి గాంచనేరవు. కావున మన సాంప్రదాయములను బట్టియు, మన దేశీయుల యలవాటులను బట్టియు, ఇతరపరిస్థితులను బట్టియు, ఇచటి యుద్యమములు ప్రచారమగుచుండవలయును. అటులని పాశ్చాత్యదేశములయొక్క అనుభవములను దీసికొనరాదనువారుండరు. అయితే అట్టి యనుభవములకు మనము దాసులమై మన రూపు మాఱిపోరాదు. ఆ యనుభవములు మనకు దాసులై మన యుద్యమముయొక్క సౌష్ఠవమునకు మన యుద్యమముయొక్క సౌందర్యమునకు దోహదదాయకములై యుండవలయును. మనుజుని సంపూర్ణ మనుష్యత్వమును వ్యక్తీకరించుటకు మన పూర్వులు, దేవాలయములు,

గ్రామసంఘములు, ఉత్సవములు, పండుగలు, తీర్థయాత్రలు, భజనలు, హరికథలు, జంగముకథలు, తోలుబొమ్మలు, మున్నగు అసంఖ్యాకములగు ప్రతిష్ఠాపనలను నెలకొలిపియున్నారు. ఈ ప్రతిష్ఠాపనలయందెల్ల అగ్రగణ్యమైనది దేవాలయము. దీని మహిమ వర్ణింప దరముగాదు. వివాహములకు సాక్షి, ప్రమాణములకు రచ్చ, ధర్మశాస్త్ర చర్చలకు సభాస్థానము, పరదేశీయులకు ధర్మశాల, పనివాండ్రకు ప్రాపు, సన్యాసులకు మఠము, భిక్షవరులకు ఉనికిపట్టు, లలితకళలకు ప్రదర్శనశాల, జ్ఞానులకు గ్రంథాలయము. ఇది యది యననేల. ప్రజలకు జీవనాధారమై, జ్ఞానదాయకమై, సౌందర్యస్థానమై, ఆనందాంబుధియై, దేవాలయము విరాజిల్లుచుండును. దానియందు సాంఘిక జీవనమంతయు పుంజీభూతమై యున్నది. సంఘశక్తులకన్నింటికిని అది మచ్చులపాకడి వంటిది. పిన్నలు, పెద్దలు, విద్యావంతులు, చదువులేనివారు, ధనవంతులు, పేదలు, లౌకికులు, భక్తులు, వీరువారననేల అన్ని రకములైన జనులును అచ్చోటికి ఆకర్షింపబడుచు భుక్తిముక్తులను సాధించెదరు.

గ్రామసంఘములుగూడ మన దేశచరిత్రయందు మిక్కిలి ప్రాముఖ్యమైన స్థానమును వహించినవి. ప్రాచీనకాలమునుండి గ్రామముయొక్క సమస్యలెల్ల ఈ సంఘముచేతనే పరిపాలింపబడుచుండెను. ప్రస్తుతము అమలునందున్న పురపాలక సంఘములవలె గ్రామముయొక్క పాలనమును అంతను ఇవియే నిర్వహించుచుండెను.

కాలక్రమేణ ఈరెండు సంస్థలుగూడ తమ పటుత్వమును గోల్పోయినవి. ఇప్పుడు ధర్మగ్రంథాలయములు ఈ రెండు ప్రాచీన ప్రతిష్ఠాపనల యొక్క స్థానమును ఆక్రమింపవలయును.

## గ్రంథాలయ ఉపయోగ మెవరికి?

గ్రంథాలయములు పరీక్ష పట్టాలను బొందగోరువారికి గాదు. గ్రంథాలయము సర్వసామాన్య జనులయొక్క సర్వకళాశాలయై యున్నది. కావున అది జనులయందున్న అన్ని తరగతుల వారికిని ఉపయోగకారియై వెలయవలయును.

గ్రంథాలయములు ఉపకరింపవలసిన మొదటి తరగతివారు:—చదువుకొన శక్తికలిగి, చదువుకొనవలయు ననెడి తృష్ణగూడ కలవారు. వీరికి సద్గ్రంథ సేకరణము నందు తోడ్పడవలయును.

గ్రంథాలయములు ఉపకరింపదగిన రెండవతరగతివారు:—చదువుకొనగలిగి, చదువుకొనవలయు ననెడి వాంఛ లేనివారు. వీరికి చదువునందు రుచిని బుట్టించుటకు గ్రంథభాండాగారి విశేషముగా పాటుపడవలసియున్నది. ఇందుకొరకై తరుచుగా గ్రంథవిశదీకరణములను ఉపన్యాసములను ఏర్పరచి, వారి నాకర్షించి, ఎవ్వరెవ్వరి కేయే గ్రంథములు అనువుగనుండునో అట్టివారి కట్టి గ్రంథములనే అందజేయుచుండవలెను. పుస్తకముల సౌలభ్యమును బట్టి జనులు వారి అధికారముల ననుసరించి పుస్తకములు—అమరియుండవలెను. పరస్పర మొకరు తెగియుండక పోయినను మనము జేయుపనియంతయు వ్యర్థము. సామాన్యజనులు పుస్తకములకు తగియుండునటుల యత్నించుట గాదు. ఏలయనగా వారికి తగిన పుస్తకములనే మనము సమకూర్చవలెను. గ్రంథాలయమువందున్న ప్రతిగ్రంథమునకు ఒక చదువరిని—ప్రతి చదువరికి ఒక గ్రంథమును సమకూర్చవలెను.

గ్రంథాలయములు ఉపకరింపదగిన మూడవతరగతివారు:—మనదేశమున తమంతట తాము చదువుకొనజాలని జనుల సంఖ్య నూటికి తొంబదికంటె ఎక్కువ. విద్యావిహీనులను విద్యావంతులను జేయుట మనకు నసాధ్యము గావచ్చును. కాని వారిని జ్ఞానవంతులుగా నొనరజేయుట మనవిధ్యుక్తధర్మము. చక్షురింద్రియ సంయోగము వలననేగాక శ్రవణమూలమునను—చిత్రపట మూలమునను జ్ఞానాభివృద్ధి చేయనగును. ప్రాచీన ఆర్యుల కాలమునుండియు, లిపి వ్యాపకమునకు బూర్వమునుండియు గూడ భారతవర్షమున జ్ఞానము గ్రంథముల మూలముననేగాక, శ్రుతిమూలముగ గూడ వ్యాపించుచుండెననుసంగతి సుప్రసిద్ధమే. నా - శ్రుతిమూలకమగు జ్ఞానము పురాతనకాలముననే గాక నేటికిని ధారణాశక్తి సహాయముతో వ్యాపింపజేయుట అవశ్యకమై యున్నది. అక్షరాస్యులు కాని జనసామాన్యముయొక్క జ్ఞానాభివృద్ధికిగాను అనేక మార్గములు అవలంబింప బడియున్నవి. హరికథలు, పురాణశ్రవణములు, భాగవతములు; జంగముకథలు; మున్నగునవి యన్నియు జనసామాన్యముయొక్క జ్ఞానాభివృద్ధి కొరకే ఏర్పడినవి. అక్షరజ్ఞానములేని పాటకపుజనులచే రచియింపబడి, తరతరములనుండి ముఖాముఖిని ప్రచారమగుచున్న గాథలనుజూచిన, మనజాతియొక్క అద్భుత

ముగ ఆధ్యాత్మికౌన్నత్యము గోచరించును. ఆ గాథల యందలి దయారసము, శోకరసము, మెరుగుపూతలు లేని కథ - ఇవియన్నియు విద్యాగంధ మెరుంగని సామాన్యజనుల మనస్సుయొక్క వికాసమును విజ్ఞానాభివృద్ధిని దెలియజేయుచున్నవి. చదువురాని వారికి జ్ఞానాభివృద్ధిని గలుగజేయుటకుగాను ఆంధ్రదేశమందున్న వివిధ గ్రంథాలయములలో ఈపద్ధతు లవలంబింపబడుచున్నవి.

చిత్రపటముల మూలమున విద్యావ్యాపకము జేయు మార్గముగూడ మనకు బొత్తిగా నవీనముగాదు. దేవాలయముల మీదను, కోటగోడలమీదను, గుహాలయందును ప్రదర్శింపబడు ఐతిహాసిక, పౌరాణిక దృశ్యములన్నియు ఇందుకొరకే ఏర్పరుపబడినవి. తోలుబొమ్మలాటకూడ పామరజనుల హృదయమునకు ఉద్బోధకముగ నుండును. అయితే నవీన యంత్రసాహాయ్యము వలన ఇప్పుడీపని ఎక్కువ సౌలభ్యతతో బాహుళ్యముగ చేయుటకు వీలుగనున్నది. మాజిక్కులాంతరు, బయాస్కోపు మున్నగు నవీనయంత్రముల వలన అక్షరజ్ఞానము లేని జనులకు జ్ఞానాభివృద్ధిని చేయుట మిక్కిలి సులభమగు మార్గము.

వివిధవిషయములను గూర్చి సుబోధకము లగునటుల వారికి ఉపన్యాసములిచ్చి వారిబుద్ధికి వికాసమును గలుగజేయవలెను. మహాగ్రంథముల నెల్ల వారికి జదివి వినిపింపవలెను. వారిని మనమున్న కోటికి రమ్మనిన రారు. మనమే వారున్న స్థలమునకు బోవలెను. మన వేషభేషజముల నన్నిటిని వదలివేయవలెను. వారియందొకనిగ భావించునటులబోయి వారేమి కోరుదురో అడిగి తెలిసికొనవలెను కోరబడువానినుండియే, వారి కోర్కెలను బూరింపవలెను. కొన్ని సమయములయందు వారికోర్కెలు మనభావనలకు భిన్నములైయుండును. ప్రథమమున వారేమి కోరెదరో తెలిసికొనుడు. వారికోర్కెలను పూరింపుడు. ఈకార్యమును వేసవికాలపు సెలవులలోగాని, శీతాకాలపు సెలవులలోగాని చేయదగినది గాదు. ఇది జీవితమునంతను ధారపోయవలసిన మహత్కార్యము.

గ్రంథాలయములు ఉపకరింపదగిన నాలుగవ తరగతివారు:—పిల్లలే సంఘమునకు జీవమని చెప్పవచ్చును. వారియందు అనంతమైన శక్తులు గర్భితములైయున్నవి. ఈశక్తులను ప్రథమమున పాఠశాలలందు వర్ధిల్లజేయవలసియున్నను, సంకుచితములగు నిర్బంధపాఠపుస్తకములను పఠించుటయందే వానిని అణగద్రొక్కక, ఆశక్తులు వికాసమునొంది, విశాలములగుటకు గావలసిన దోహదము నంతను మన మీయవలసియున్నది. పిల్లలయొక్క మనస్సులు అతి కోమలములు. కావున అట్టి సమయముననే వారిని మంచిదారులయందు బెట్టుట మిక్కిలి యావశ్యకము. అట్లు చేయగలిగితిమేని, వారికి సంపూర్ణ ధైర్యసాహస ఔదార్యాది సద్గుణము లలవడుననుట కొంతమాత్రము సందేహము లేదు. ఈదినమున పిల్లలుగా నుండువారు రేపటిదినమున పౌరులగుదురు. అందుచేత పిల్లలకు సన్మార్గ మలవడజేసితిమేని మనజాతి ఔన్నత్యము నొందుటకేమియు సందియము లేదు. కాబట్టి వారికి ఉపయోగకరములగు ప్రత్యేకపుస్తకములను పటములను ఆటలను సేకరించి నేర్పుగ నుంచవలయును, ఇవి విశేషముగా బొమ్మలు గలిగినవైయుండవలయును. గోడలయందు వస్తుపాఠబోధకములగు పటములనుబెట్టి వాటినిగురించి బాలురకు బోధింపుడు, అందుకు సంబంధించిన పుస్తకములను వారు చదువునటుల అభిరుచిని గల్పింపవలెను. మఱియు సుబోధకములును నీతిబోధకములును అగు కథలనుజెప్పి వారిమనస్సుల నాకర్షించి, గ్రంథపఠనమునకు వారిని ప్రోత్సహింపవలెను.

ప్రతిగ్రంథాలయమును తన గ్రామమందుగాని పట్టణమందుగాని గల పాఠశాలతో సంబంధమును గలుగజేసికొనవలెను. పాఠశాలయందు ఉపాధ్యాయులు పాఠములను బోధించునపుడు వివిధవిషయములనుగూర్చి చెప్పునప్పుడు, ఆయావిషయములను గూర్చిన విపుల గ్రంథములు అట్టి గ్రంథాలయమున గలవని జెప్పి వానిని విద్యార్థులు చదువునటుల చేయవలెను. ఇంతియగాక, ఉపాధ్యాయులు అప్పుడప్పుడు తమ విద్యార్థులను గ్రంథాలయమునకు గొనివచ్చి, ఆయాతరగతులవారికుపయోగకరములగు గ్రంథములందు అభిమానము గలుగునటుల ఉపన్యాసముల నొసగుచుండవలయును.

గ్రంథాలయములు ఉపకరింపదగిన అయిదవ తరగతివారు:— స్త్రీలుగూడ న్యాయముగ పైన వివరించిన నాలుగు తరగతులక్రిందకే వచ్చెదరు. కాని మన దేశ పరిస్థితులనుబట్టి స్త్రీలకు ప్రత్యేక సౌకర్యములను జేయవలసియున్నది. అవకాశమున్న స్థలములయందెల్ల వారికి ప్రత్యేక గ్రంథాలయములను నిర్మింపవలెను. ప్రత్యేక గ్రంథాలయములను స్థాపించుటకు సావకాశములేని స్థలములయందెల్ల, గృహములకు గ్రం

ధముల నంపి స్త్రీలు విశేషముగ చదువునటులను, చదివినదానిని వినునటులను చేయవలయును. పురాణము లన్నను ఉత్సవము లన్నను పండుగలన్నను స్త్రీలకు ప్రీతి మెండు. అట్టివాని నేర్పరచి, వారిని గ్రంథాలయములకు వచ్చునటుల జేసి జ్ఞానవంతులగునట్లు చేయవలయును. ఇంతవరకు ఆంధ్రగ్రంథాలయోద్యమ సిద్ధాంతములను గూర్చి నాకు అర్థమైనంతవరకు ముచ్చటించితిని. ఇక ముందు ఆంధ్రగ్రంథాలయోద్యమ చరిత్రను కొంతవరకు తెలిసికొందము.

## ఆంధ్రదేశమున ధర్మగ్రంథాలయముల ప్రారంభము.

ఆంధ్రభాషకు అచ్చక్షరములు 1806 వ సంవత్సరమున తయారు చేయబడినవి. పిమ్మట 1834 వ సంవత్సరమునందు ఆంధ్రగ్రంథములు అచ్చుపడుటకు ప్రారంభమైనది. పరిశోధనకలన మనకు తెలిసినంతవరకు ఆంధ్రదేశమున మొట్టమొదటి సార్వజనిక గ్రంథాలయము 1886 వ సంవత్సరమున విశాఖపట్నమున స్థాపితమైన "సరస్వతీనిలయ"మై యున్నది. ఈ గ్రంథాలయము అంతకు పూర్వము కొన్ని సంవత్సరముల క్రిందటనే స్థాపింపబడియున్నను, ఆ సంవత్సరమునందు మాత్రమే అది సార్వజనికమై యొప్పినది. గ్రంథాలయమన్నను, అందులో సార్వజనిక గ్రంథాలయమన్నను, బాగుగా తెలియని దినములయందు ఆంధ్రదేశమందీ సార్వజనిక గ్రంథాలయ స్థాపన మొనర్చిన మహానుభావుని నామము, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్రయందు సువర్ణాక్షరములతో లిఖింపబడుననుట కొంతమాత్రమును సందియము లేదు. ఆ మహామహుడు గొప్పధనవంతుడా కాడు. గొప్ప విద్వాంసుడా కాడు. సామాన్య బీద ఉపాధ్యాయుడు. కాని గొప్పధనవంతులుగాని గొప్ప విద్వాంసులుగాని చేయజాలని మహాకార్యమును ఈ మహానుభావుడు సాధించి, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు పునాదిని వేసినాడు,

పిమ్మట, కడపజిల్లా పులివెందులలో సరస్వతీ గ్రంథాలయము బయలుదేరినది. ఆంధ్రదేశమున బయలుదేరిన మొదటి రెండు గ్రంథాలయములకును "సరస్వతీదేవి" పేరున నామకరణమగుట ఆంధ్రుల ప్రతిభావిశేషమునకు వన్నె తెచ్చుచున్నది. తరువాత 1890 సంవత్సరమున గుంటూరుజిల్లా వంగోలులో సి. వి. యస్. లైబ్రరీ బయలుదేరినది. 1894 సంవత్సరమున విజయనగరమున "సింహాచలపతిరావు" లైబ్రరీ బయలుదేరినది. 1895 సంవత్సరమున భీమవరము తాలూకా ఉండిగ్రామమున "నార్థోజీక్లబ్బు" ను 1897 సంవత్సరమున ఆ తాలూకాయందే కుముదవల్లి గ్రామమున "వీరేశలింగకవి సమాజము" ను స్థాపింపబడినవి 1899 సంవత్సరమున తెనాలి తాలూకా కొల్లూరు గ్రామమున "రీడింగుక్లబ్బు బయలుదేరినది. 1900 వ సంవత్సరమున గుంటూరుపట్టణమునందు యువకులు సాహితీసంఘము "యంగుమెన్సులిటరరీ అసోసియేషను" రాజమహేంద్రవరమున "వీరేశలింగపుస్తకభాండాగారము"ను బయలుదేరినవి. 1904 సంవత్సరమున నైజాముర్రాష్ట్రమునందలి హైదరాబాదు పట్టణమున "కృష్ణదేవరాయాంధ్రభాషానిలయము" స్థాపింపబడినది. పిమ్మట యావదాంధ్రదేశమునందును సార్వజనిక గ్రంథాలయములు స్థాపింపసాగినవి. 1911 సంవత్సరమున కృష్ణాజిల్లా బెజవాడపట్టణమున శ్రీ రామమోహన గ్రంథాలయము స్థాపింపబడినది. 1913 సంవత్సరమున ప్రథమ ఆంధ్రమహాసభ "బాపట్ల" యందు జరిగినది మొదలు ఆంధ్రులయందు నూతనతేజము వికసిల్లసాగినది. అప్పటినుండియు గ్రంథాలయములును పఠనమందిరములునుగూడ విరివిగ స్థాపింపబడసాగినవి.

ఇట్లు బయలుదేరిన గ్రంథాలయములలో కొన్ని స్త్రీల యుపయోగమునకై ప్రత్యేకము స్త్రీలచే స్థాపింపబడినవి గలవు. పెక్కు గ్రంథాలయములందు పురుషులను స్త్రీలునుగూడ సామాజికులుగా నున్నారు. ఈ గ్రంథాలయము లన్నింటియందును జనసామాన్యమునకందరికిని ఉచితముగా గ్రంథములను వార్తాపత్రికలను ఉపయోగించు అధికారము గలదు. కొన్నింటికి స్వంతభవనములు గలవు. కొన్ని సంఘములు రాత్రి పాఠశాలలను నిర్వహించుచున్నారు. వివిధవిషయములనుగూర్చి జనులకు సుబోధకములగు రీతిని ఉపన్యాసము లిప్పించుట అన్ని గ్రంథాలయములకును సర్వసామాన్యమేను. ఇదిగాక చదువుకొనజాలనట్టియు; చదువునందు వాంఛలేనట్టియు జనుల ఉపయోగమునకై పురాణపఠనము, జంగము కథలు, భాగవతములు మొదలగు పలువిధములైన పూర్వ సంప్రదాయ సిద్ధములైన మార్గములు అవలంబింపబడుచున్నవి. మరియు గ్రామపారిశుద్ధ్యప్రయత్నములు, ప్రదర్శనములు, బహుమతి పరీక్షలు, గ్రంథముల యొక్కయు, కరపత్రముల యొక్కయు ప్రకటనము - ఇత్యాది ప్రయత్నములు కూడ జరిగినవి.

## ఆంధ్రదేశగ్రంథాలయసంఘము — అది చేసిన పని

ఆంధ్రదేశమందు ఇట్లు బయలుదేరుచున్న వివిధ గ్రంథాలయములయందు సోదరభావమును గలుగజేయుటకును, పరస్పర సహాకారమును గలుగజేయుటకును, ధర్మగ్రంథాలయ మహావృక్షము ఆంధ్రదేశమునందెల్లెడల తన వేరులనుబారుకొని యూడలను సారింప చేయుటకు గాను 1914 వ సంవత్సరమున బెజవాడయందున్న శ్రీ రామమోహన ధర్మగ్రంథాలయమువారు ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభను సమావేశపరచినారు. ఆ సభకు సుప్రసిద్ధులగు (శ్రీ) చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు అధ్యక్షత వహించినారు. ఆ సభకు కృష్ణా - గోదావరి - గుంటూరు - విశాఖపట్నము - గంజాం - నెల్లూరు - కడప - కర్నూలు - బళ్లారి జిల్లాలనుండియు, నైజాము రాష్ట్రముయొక్క ఆంధ్రభాగము నుండియు పలువురు ప్రతినిధులు విచ్చేసిరి. ధర్మగ్రంథాలయోద్యమముయొక్క వివిధదశలను గూర్చి సమర్థులగువారిచే అనుభవపూర్వకము లగు ఉపన్యాసము లియ్యబడెను. ఈ సభయొక్క ఫలితముగ గ్రంథాలయోద్యమమును గూర్చి గాఢాభిమానము గలిగినది.

ఈ సభయందే, ఆంధ్రదేశమునందంతటను గ్రంథాలయములను నెలకొల్పుటకును, నెలకొల్పిన వానిని పెంపొందింప జేయుటకును, తగిన ఉత్సాహము నిచ్చుటకును ఆంధ్రదేశగ్రంథాలయసంఘమను పేరున శాశ్వత సంఘమునొకదానిని ఏర్పాటుజేసిరి. ఆసంఘమునకు ప్రథమ అధ్యక్షులు దివాన్ బహద్దరు మోచర్ల రామచంద్రరావు పంతులుగారు. ప్రథమసభ గలుపుకొని, అప్పటి నుండి నేటివరకు పదునాలుగు ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభలు, ఈ సంఘముయొక్క వివిధ జిల్లాలయందు జరిగినవి. ఈసభలయొక్క అహ్వాన సంఘాధ్యక్షులందును అధ్యక్షులందును శ్రీరాజా పానుగంటి వేంకటరామారాయణింవారు, కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావు బహద్దరుగారు, శ్రీరాజా విక్రమదేవ వర్మగార్లవంటి రాజ్యాధిపతులును, ఏ. పి. పాత్రో, భూపతిరాజు వెంకటపతిరాజు, సామి వెంకటాచలం శ్రేష్ఠిగార్లవంటి శాసన నిర్మాణసభా సభ్యులును, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, వేమవరపు రామదాసు పంతులు, గద్దె రంగయ్యనాయుడు; మాగంటి బాపినీడువంటి దేశనాయకులును, బారు నరసింహారావు, చెంగయ్యపంతులు, దేశిరాజు హనుమంతరావుగార్లవంటి సుప్రసిద్ధ న్యాయవాదులును, చిలకమర్తి లక్ష్మీనరసింహం, చిలుకూరి వీరభద్రరావు, చెన్నాప్రగడ భానుమూర్తి, తల్లావఝుల శివశంకరశాస్త్రి, డాక్టరు బుర్రా శేషగిరిరావు, జనమంచి శేషాద్రిశాస్త్రిగార్లవంటి కవిశేఖరులును, నూరి వేంకటనరసింహశాస్త్రి, వెల్లంకొండ రాఘవరావు, పురాణం సూరిశాస్త్రిగార్లవంటి గ్రంథాలయోద్యమ సేవకులును గలరు. ఇట్టి మహామహుల ఆదరణాభిమానముల వలనను మార్గదర్శకత్వము వలనను గ్రంథాలయోద్యమ మొక ఒడుదుడుకులు లేకుండ ఇంతవరకు తన యాత్రను నిర్విఘ్నముగ కొనసాగించుచు వచ్చినది.

కొంతకాలమైన పిమ్మట ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము 1916 సంవత్సరము 12 నంబరు ఆక్టుక్రింద రిజిష్టరు చేయబడినది. గ్రంథాలయ ప్రచారకులను తయారు చేయుటకై ఒకమాసము దినములు తాత్కాలిక పాఠశాలను నిర్వహించితిమి. పల్లెటూళ్ళ సమస్యలకును, గ్రంథాలయ పరిపాలనకును సంబంధించిన వివిధ విషయములనుగూర్చి ఆయావిషయములయందు పరిశ్రమ జేసిన సమర్థులచే అనుభవపూర్వకములైన ఉపన్యాసము లియ్యబడినవి. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘపక్షమున అనేకమంది సేవకులు ఆంధ్రదేశమందంతటను సంచారముజేసి, నూతనగ్రంథాలయములను స్థాపించుటకును, ఉన్నవానిని ఉత్తేజింప జేయుటకును పలువిధముల పాటుబడియున్నారు. వీరికి జీతములు లేవుగదా, బత్తెములుగూడ లేవు. 1914-వ సంవత్సరమునందు ఆంధ్రదేశమునందున్న అట్టి సోదరసేవకులయొక్క పరిశ్రమ ఫలితముగ 1914-వ సంవత్సరమునందున్న 163 ఆంధ్ర గ్రంథాలయములను నేడు 600 కంటె ఎక్కువ సంఖ్య గలవియైనవి. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ నిర్మాతలు అనేకమందిగలరు. అట్టివారిలో నాకు జ్ఞాపకమున్నవారి పేర్ల నిటవివరింతును:—

గంజాంజిల్లా:— బలరామయ్యగారు, జగన్నాథ పాడి శుభంగిగారు, న్యాపతి నారాయణమూర్తిగారు, సింహాచలంగారు, టంకాల సాంబమూర్తిగారు, పొట్నూరి స్వామిబాబుగారు.

విశాఖపట్నంజిల్లా:—మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, ప్రభల లక్ష్మీనరసింహంగారు, తూర్పాటి

సన్యాసమ్మగారు, ముద్దా సోమప్పశాస్త్రిగారు, వసంతరావు, బుచ్చి సుందరరావుగారు. ఉప్పల నారాయణాంబగారు.

తూర్పుగోదావరి:—కళా వెంకట్రావుగారు, యాతగిరి లక్ష్మీవెంకట రమణగారు, చింతపల్లి వెంకటరమణయ్యగారు, అద్దంకి సత్యనారాయణ శర్మగారు, నాళం కృష్ణారావుగారు, పులవర్తి భీమలింగమూర్తిగారు, చిక్కాల వెంకటరత్నంగారు, దంటు కృష్ణమూర్తిగారు, ఉరిమిళ్ళి జగన్నశాస్త్రిగారు, అడిదం శంకరరావుగారు, బాలాంత్రపు శేషమ్మగారు, గాడేపల్లి సూర్యనారాయణ శర్మగారు, కావ్యనిధి వెలికొని లచ్చారావుగారు, వెలికొని సూర్యారావుగారు, వంగూరి సుబ్బారావుగారు, ముత్యాల వేణుగోపాలరావుగారు, వేప్పూరి వేణుగోపాలదాసుగారు, కొత్త బుచ్చిరాజుగారు, కంభంపాటి సోమయాజులుగారు, కోడేటి రంగాచార్యులుగారు.

పశ్చిమగోదావరి:—మాగంటి బాపినీడుగారు, మంగిపూడి వెంకటశర్మ, పురుషోత్తమశర్మ సోదరులు, భూపతిరాజు తిరుపతిరాజుగారు, ముద్దుల వెంకటచిన్నం శ్రేష్టిగారు, కనివారపు సుబ్బారావుగారు, నిడదవోలు వెంకట్రావుగారు, అత్మకూరు గోవిందాచార్యులుగారు, తాడిమేటి టుంబశాస్త్రిగారు, కాళ్లకూరి నరసింహంగారు. నిడమర్తి లక్ష్మీనారాయణగారు, పోతూరు పేర్రాజుగారు, అన్నదేవర నాగభూషణరావుగారు.

కృష్ణాజిల్లా:— ఆరెకపూడి రామశాస్త్రులుగారు, దుగ్గిరాల వేంకటసుబ్బయ్యగారు, కల్లేపల్లి వేంకట్రావుగారు, సాధు రామకృష్ణయ్యగారు, గంపలగూడెం కుమారరాజాగారు, పేట బాపయ్యగారు, కొండాలి ఆంజనేయులుగారు, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, నోరి వెంకటేశ్వర్లుగారు, గోపరాజు బ్రహ్మానందంగారు, సూరి వెంకటనరసింహశాస్త్రిగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, మోటుపల్లి రాజాబాయమ్మగారు, చెరుకువాడ వెంకటనరసింహంగారు, భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు, గుత్తా వీరయ్యగారు, అట్లూరి వీరయ్యగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, కొండాలి శివరామకృష్ణారావుగారు.

గుంటూరుజిల్లా:—తాడంకి వెంకయ్యగారు, పున్నయ్యగారు, పులిచెర్ల రామారావుగారు, అంచె శివయ్యగారు, కుప్పా శ్రీరామశర్మగారు, కోలచెన్ను రామకోటీశ్వరరావుగారు. పత్రి అనంతరావుగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, గట్టి నరసింహారావుగారు, బెల్లంకొండ రాఘవరావుగారు, చెరువు సుబ్రహ్మణ్యంగారు, శరణు రామస్వామిగారు, చింతమనేని భావయ్యగారు, బాలకవి తుమ్మల సీతారామమూర్తిగారు, రామరాజు వీరేశ్వరరావుగారు, ఉక్కలరాజు వాసుదేవరావుగారు, ముద్దుల గిరిరావుగారు, గుంటూరు నరసింహారావుగారు.

నెల్లూరుజిల్లా:—వెన్నెలకంటి పట్టాభిరామరెడ్డిగారు, మన్నేపల్లి రామకృష్ణారావుగారు, నెల్లూరు నగరాజారావుగారు.

చిత్తూరుజిల్లా :— సీ. వి. రంగంశ్రేష్టిగారు, బుద్దూరు రామానుజులరెడ్డిగారు, శ్రీనివాసాచార్యులుగారు.

అనంతపురము.—పాటీల్ శంకరరావుగారు, కలచవీడు వెంకటరమణాచార్యులుగారు, యం. సన్నప్పనాయుడుగారు. జెల్లాం రామదాసు నాయుడుగారు, ఎగపి ఆంజనేయులుగారు, కల్లూరు వెంకట సుబ్బారావుగారు, పప్పూరు రామాచార్యులుగారు.

కర్నూలు:—గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు, కే. నరసింగరావుగారు, దేశపాండ్య సుబ్బారావుగారు, కైప సుబ్రహ్మణ్యంగారు, వావిలాల పరబ్రహ్మశాస్త్రిగారు.

కడప:—వేదము వెంకటకృష్ణశర్మగారు, ఛత్రి సీతారామయ్యగారు, కే. గుండురావుగారు, విరూరు పిచ్చయ్యగారు, వెల్లాల రామకృష్ణశాస్త్రిగారు, గుళ్లపల్లి పున్నయ్యశాస్త్రిగారు.

మద్రాసు:—కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, టంగుటూరి ప్రకాశంగారు, వేమవరపు రామదాసుగారు, వి. ఎల్. శాస్త్రిగారు, వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు, గోనుగుంట్ల వెంకట సుబ్రహ్మణ్యంగారు, ఎన్. ఎస్. రాయునుగారు, చల్లా శేషగిరిరావుగారు, పింజల సుబ్రహ్మణ్య శ్రేష్టిగారు, గద్దె రంగయ్యనాయుడుగారు.

నైజాం :— మాడపాటి హనుమంతరావుగారు, ఆలూరు గిరిరాజారావుగారు, ఆదిరాజు వీరభద్రరావుగారు, పింగళి వెంకట్రామారెడ్డిగారు, మునగాల రాజాగారు.

ఈ సంఘపక్షమున గ్రంథాలయసర్వస్వము అను పేరున కొన్ని సంవత్సరములకాలము పత్రిక యొకటి ప్రకటింపబడినది. ఈ పత్రిక ఉద్యమ నిర్వాహకులకు అమితసహాయ మొనర్చినది. ఈ పత్రిక ప్రతి సంవత్సరమును నష్టము వచ్చినను మానక పట్టుదలతో నిర్వహించితిమి. దీనిమూలమున నవీన గ్రంథాలయోద్యమతత్త్వమును ఉచ్చైస్స్వరముతో ఆంధ్రదేశమునం దంతటను జాటి వ్యాపింపజేయగలిగితిమి. ఇదిగాక కాకినాడవాస్తవ్యులును, గ్రంథాలయోద్యమమునందు నిరంతరమగ్నమానసులును నగు శ్రీ యాతగిరిలక్ష్మీ వేంకట రమణగారు, ధర్మగ్రంథాలయ పత్రికను విశేష వ్యయ ప్రయాసలతో కొంతకాలము నడిపి, గ్రంథాలయోద్యమమునకు వారికిగల గాఢాభిమానమును సువ్యక్తపరచిరి. మరియు వీరిచే రచియింపబడిన గ్రంథాలయోద్యమము అను గ్రంథము ఆంధ్రదేశ గ్రంథాలయసంఘముచే ప్రకటింపబడెను. ఈ సంఘ కార్యనిర్వాహకసంఘాధ్యక్షులైన శ్రీ సూరి వెంకట నరసింహశాస్త్రిగారు గ్రంథాలయోద్యమమును గూర్చిన ఉత్తమగ్రంథము నొకదానిని వ్రాసిరి. ఆ గ్రంథము వలన ఆంధ్రగ్రంథాలయోద్యమ సిద్ధాంతమును మన యుద్యమముయొక్క ప్రాశస్త్యమును భారతవర్షమున గల ఇతర రాష్ట్రములవారికి జాటగలుగుటయేగాక, కొన్ని రాష్ట్రములందు ఈ యుద్యమబీజములను గూడ నాటగలిగితిమి. ఇవియేగాక మరికొన్ని గ్రంథములును కరపత్రములుగూడ ఈ సంఘముచే ప్రకటింపబడినవి.

ఆంధ్రమునం దున్న గ్రంథములన్నిటియొక్క గ్రంథనామచంద్రికను తయారుచేయుటకై ఈ సంఘపక్షమున శ్రీ వెలిదండ్ల హనుమంతరావు పంతులుగారు విశేష శ్రమను జేసి, గ్రంథవిభజనపద్ధతి యొకదానిని తయారుచేసి షుమారు 3000 గ్రంథములను వర్గీకరణము జేసిరి. వీరు అంతవరకు జేసిన పనిని ఇంకను ఎక్కువ సమర్థతతో నిర్వహించుటకై శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు పూనుకొని విశేషవ్యయప్రయాసలతో దానిని పూర్తిచేసి, ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులయిరి. కాని ఈ గ్రంథమునకు అవలంబింపబడిన వర్గీకరణపద్ధతి నవీన గ్రంథాలయ శాస్త్రపద్ధతులకు అనుగుణ్యముగ లేదు. ఒక భాషయందలి గ్రంథములకు చక్కని శాస్త్రసిద్ధమైన వర్గీకరణపద్ధతి యుండినగాని, ఆభాషా గ్రంథములయొక్క సౌష్ఠవము, ఆభాషయం దుండవలసిన గ్రంథముల ఆవశ్యకత బోధపడదు. అదిగాక గ్రంథాలయములందలి గ్రంథములు అభివృద్ధి జెందిన కొలది గ్రంథములకు వేయుసంఖ్య మార్పు చెందకనుండవలెను. మరియు ఒకేవిషయమునం దున్న గ్రంథము లన్నియు ఒకచోటనే చేరునటులకూడ చూడవలయును. అందులకై ఆంధ్రగ్రంథములకు అనువుగ నుండునటుల గ్రంథవర్గీకరణపద్ధతిని ఒకదానిని సమకూర్చి బెజవాడ యందున్న రామమోహన ధర్మగ్రంథాలయమునందు కొన్ని వత్సరములనుండి అమలులో పెట్టి పరిశీలించితిమి. ఆపద్ధతి మిక్కిలి యనుకూలముగ నున్నది. అది బరోడా కేంద్రగ్రంథాలయమువా రవలంబించిన మాదిరి ననుసరించి తయారు చేయబడినది.

1914 సంవత్సరమునకు పూర్వము గ్రంథాలయములను స్థాపించుటయు, పోషించుటయు స్థానిక స్వపరిపాలక సంఘములయొక్క విధులలోనికి రాదని ప్రభుత్వముయొక్క వైఖరి చూపుచుండెను. కొన్ని గ్రంథాలయములకు స్థానికసంస్థలు మంజూరు చేసిన విరాళములను ప్రభుత్వమువారు రద్దుపరచుటగూడ జరిగినది. అట్టి సమయమున బెజవాడయం దున్న రామమోహన ధర్మగ్రంథాలయమువారు అప్పుడు మద్రాసు ప్రభుత్వమునందు కార్యనిర్వాహక సభాసభ్యులుగా నున్న సర్ వి. యస్. శివస్వామి అయ్యరుగారికి ఈకష్టమును గూర్చి విన్నవింపగా వారు సదరు గ్రంథాలయముయొక్క నూతనభవనమునకు పునాదిరాయిని వేయుచు గ్రంథాలయములను నిర్వహించుటయు పోషించుటయును గూడ స్థానికసంస్థలయొక్క విధులలోనికి వచ్చునని విస్పష్టముగా చెప్పివైచిరి. అంతటితో ఆయడ్డంకి తీరిపోయినది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముయొక్క ఆందోళనాఫలితముగ ఎక్కువస్థానిక సంస్థలు గ్రంథాలయములను ధారాళముగ పోషింపసాగినవి. బెజవాడ, గుంటూరు పురపాలక సంఘములు స్వంత గ్రంథాలయములనే స్థాపించినవి. తాడేపల్లిగూడెం తాలూకాబోర్డువారు గ్రామపునర్నిర్మాణతరగతులను నిర్వహించి అందు గ్రంథాలయోద్యమమును గూర్చి కూడ ఉపన్యాసముల నిప్పించుటయేగాక స్వంత గ్రంథాలయమును స్వంతభవనముతోగూడ స్థాపించిరి. గోదావరిజిల్లాబోర్డు, కృష్ణాజిల్లా బోర్డులవారు గ్రంథాలయ భవనములకై విరాళముల నొసంగిరి. ఈ రీతిగా ఆంధ్రదేశమునం దంతటను స్థానిక సంస్థలు గ్రంథాలయములకు తోడ్పడుచున్నవి.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారి ప్రచార ఫలితముగ ఈ రాజధానియందలి గ్రంథాలయముల

కొరకు కొంత ద్రవ్యమును ప్రత్యేకింపవలె నని శ్రీ కొండ వెంకటప్పయ్య పంతులుగారిచే మద్రాసు శాసననిర్మాణసభయందు తేబడిన తీర్మానము తుదకు అంగీకరింపబడి, తత్ఫలితముగ అప్పటినుండి ప్రతిసంవత్సరమును ప్రభుత్వమువారిచే గ్రంథాలయములకు కొంతిసొమ్ము విరాళముగ ఇయ్యబడుచున్నది.

ఆంధ్రదేశమునం దున్న గ్రంథాలయము లన్నింటి యొక్క చరిత్రము తయారు చేయుటకై ప్రశ్నావళి నొకదానిని తయారుజేసి గ్రంథాలయముల కన్నింటికిని బంపి, జవాబులు తెప్పించి, అందుండి గ్రంథాలయముల చరిత్ర తయారు జేయబడి ప్రకటింపబడినది. ఈ రీతిగా పెక్కుసాధనలు చేయుటవలన ఆంధ్రగ్రంథాలయముల అభివృద్ధిని గూర్చి తెలిసికొనుటకు వీలుకలిగినది.

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ ప్రతినిధులు కర్నూలు, కడప, చిత్తూరు మున్నగు మండలములయందు జరగిన మండలసభలకు బోయి. గ్రంథాలయముల స్థాపనావశ్యకమునుగూర్చి ఉపన్యాసముల నిచ్చి, తీర్మానములను జేయించి ఉద్యమప్రచారము సాగించిరి.

దక్షిణాఫ్రికాయందు యుద్ధము జేసిన ఆంధ్రసోదరులు విశ్రాంతి సమయమునందు జదువుకొనుటకై పత్రికలును గ్రంథములును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముచే పోగుచేయబడి, వారికి పంపబడినవి.

ఆంధ్రదేశమున గల కొన్ని గ్రంథాలయములయొక్క ఆదరణక్రింద సంచారగ్రంథాలయపేటికలు చుట్టుప్రక్కల గ్రంథాలయములు లేని గ్రామములకు పంపబడుచున్నవి. ప్రత్యేకముగా గ్రంథాలయములను నిర్వహింపలేనట్టియు సర్వహించుటకు వాంఛలేనట్టియు గ్రామములకు సంచార గ్రంథాలయ పేటికలు మిక్కిలి ఉపయోగకరముగ నున్నవి.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముయొక్క ప్రచారమూలమున పౌరగ్రంథాలయములను గూర్చిన పరిజ్ఞానము ఆంధ్రదేశమునం దంతటను విరవిగ వ్యాపించినది. పెక్కు మండలములయందు మండల గ్రంథాలయ సభలు సమకూర్చబడి, సంవత్సరమునం దంతటను ఆయా మండలములయందు గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటకై మండల గ్రంథాలయ సంఘములు ఏర్పడినవి. ఇదేరీతిని తాలూకా గ్రంథాలయ సభలును, తాలూకా గ్రంథాలయ సంఘములును ఏర్పడినవి. అక్కడక్కడ పట్టణ గ్రంథాలయ సంఘములు కూడ స్థాపింపబడినవి. గుంటూరు మండల గ్రంథాలయ సంఘమువారు జ్ఞానదాయకములగు పలు విషయములనుగూర్చి సమగ్రులగువారిచేత సులభశైలిని వ్రాయించి కరపత్రములను ప్రకటించి వేలకొలది ప్రతులను వారి మండలము నందేగాక, ఆంధ్రదేశమునందంతటను విరవిగా పంచిపెట్టిరి.

విశాఖపట్టణమునందు జరగిన ఆంధ్రదేశ గ్రంథాలయ సభానిధుల మహాసభయందు బెజవాడయందున్న రామమోహన గ్రంథాలయమును ఆంధ్రదేశమునకు కేంద్ర గ్రంథాలయముగా పరిగణించుటకు తీర్మానించిరి. కేంద్ర గ్రంథాలయమునకు శ్రీవావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సువారు తమచే ప్రకటింపబడిన గ్రంథముల నన్నింటిని ఉచితముగా నిచ్చి ప్రోత్సహించిరి.

ఈ రీతిగా తాలూకా గ్రంథాలయ సంఘములు మండల గ్రంథాలయ సంఘములు, కేంద్ర గ్రంథాలయము ఏర్పడి, పల్లెటూళ్లయందున్న గ్రామ గ్రంథాలయముల పనిని సమీకరణము జేయుచు, జనులకు ఇంకను ఎక్కువ ఉపయోగకరములగుటకై నిరంతర ప్రచారమును జేయుచున్నవి. ఇట్టి నిర్మాణము ప్రభుత్వముయొక్క సహాయమున బరోడా రాష్ట్రమున ఆచరణయోగ్యమై యొప్పినది. ఆంధ్రదేశమునందు నీ యేర్పాటు స్వశక్తిచేత కొంతవరకు కొనసాగినదని చెప్పవచ్చును.

మండల కేంద్రగ్రంథాలయము లన్నింటికిని శ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రులుగారును, ఇంకను కొందరు ప్రకాశకులునుగూడ తమచే ప్రకటింపబడిన గ్రంథముల నన్నింటిని ఉచితముగా నొసంగెద మని వాగ్దానముజేసి, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు గొప్ప చేయూతనొసంగినారు. ఇట్టి మహాదాతల యనుగ్రహమువలన గాని గ్రంథాలయోద్యమము తీవ్రవ్యాప్తిని గాంచజాలదు.

భారతవర్షమునవీన గ్రంథాలయోద్యమమునకు "బరోడా" రాష్ట్రము ఆదర్శమని చెప్పవచ్చును. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమముయొక్క ఆకారమును నిర్మించుటయందు "బరోడా" రాజ్య గ్రంథాలయోద్యమము అమితముగా దోహదపడినది. ఈ యుద్యమాభివృద్ధికి గావలసిన సలహాల నిచ్చుటకు "బరోడా" కేంద్రగ్రంథాలయాధికారులయొక్క సహాయము మరువదగినది

గారు. "బరోడా" రాజ్యమందలి గ్రంథాలయోద్యమమును జూచి వచ్చుటకై ఆంధ్రదేశ గ్రంథాలయ కార్యదర్శిగ నేను పోయి యుంటిని. ఉపన్యాసములు, పత్రికా ప్రకటనలు, మూలమునకంటె అచట నొకసారి పోయివచ్చుటవలన గ్రంథాలయోద్యమ పద్ధతులయందు అమితముగు అనుభవము కలిగినది. ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభలోను, అఖిల భారత గ్రంథాలయ సభలలోను ఏర్పాటుచేసిన ప్రదర్శనములు "బరోడా" యాత్రయొక్క ఫలితములే యైయున్నవి. భారతదేశమున "బరోడా" వారికి పిమ్మట గ్రంథాలయోద్యమ విషయమై కృషి ప్రారంభించినది ఆంధ్రులేను.

అఖిలభారత గ్రంథాలయోద్యమము.

**1918** సంవత్సరమున లాహోరు నగరమున అఖిల భారత గ్రంథ భాండాగారముల సమావేశ మొకటి ప్రభుత్వమువారిచే సమావేశము చేయబడినది. ఆ సభకు ప్రతినిధులను బంపుటకై ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు వాంఛింపగ, సభ్యులసంఖ్య అధికముగా నుండ వలయునని, స్థలము చాలదని ప్రభుత్వమువారు అంగీకరించలేదని మన తెలిపిరి. విశేష వ్యయప్రయాసములకు లోనై ఆంధ్రదేశమునుండి "లాహోరు" పట్టణమేగినను సభయందు ప్రేక్షకుడుగనైన స్థలము దొరకునో లేదో తెలియక పోవుట యటుండగా ఆ గ్రంథభాండాగారముల సభవలన మన సార్వజనిక గ్రంథాలయోద్యమమున కేమిధమైన ఉత్సాహ ప్రోత్సాహములను లేవని గ్రహించి, ఆసభకు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమునుండి ప్రతినిధుల నెవ్వరిని బంపియుండలేదు. తుదకు ఫలితముగూడ ఊహించినట్లే జరిగినది.

పిమ్మట **1919** సంవత్సరమున మదరాసులో జరుపబడిన ఆరవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభతో పాటుగ, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము యొక్క ప్రోద్బలమున, ప్రథమ అఖిలభారత గ్రంథాలయసభ సమకూర్పబడినది. దానికి బరోడారాజ్య గ్రంథాలయ శాఖకు అధ్యక్షులగు జే. యస్. కుడాల్కరు గారు అధ్యక్షత వహించిరి. మరియు ఇపుడు మనకు రాజప్రతినిధిగ నున్న విల్లింగుడను ప్రభువుగారు ఆ సభతో బాటు జరిగిన అఖిలభారత గ్రంథాలయ ప్రదర్శనమును తెరచిరి; ఈ ప్రథమసభయందే అఖిలభారత గ్రంథాలయసంఘముకూడ ఏర్పరుపబడినది. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘముయొక్క కార్యదర్శియే, అఖిలభారత గ్రంథాలయ సంఘమునకుగూడ కార్యదర్శిగనుండి, రెండవ అఖిలభారత గ్రంథాలయసభను "కాకినాడ" యందును, మూడవసభను "బెల్గాం" నందును, నాలవ సభను "మదరాసు" నందును, ఐదవసభను "కలకత్తా" యందును, ఆరవసభను "లాహోరు"నందును సమావేశపరచిరి. అఖిలభారత గ్రంథాలయోద్యమ ఫలితముగ ఇంతవరకు మహారాష్ట్రము, వంగదేశము, కర్నాటకదేశము, మదరాసురాష్ట్రము, పంజాబుదేశములందును, పుదుక్కోట సంస్థానమునందును రాష్ట్రీయగ్రంథాలయ సంఘము లేర్పరుపబడినవి. ప్రథమకర్నాటకరాష్ట్రీయ గ్రంథాలయ మహాసభకు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యనిర్వాహక సంఘాధ్యక్షులగు శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రిగారు అధ్యక్షతవహించిరి. అఖిలభారత గ్రంథాలయసభలతోను, కర్నాటక గ్రంథాలయసభతోను, జరుపబడిన గ్రంథాలయప్రదర్శనములకు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు ప్రదర్శన వస్తువులను విరివిగా బంపి, వాని జయమునకు దోహదపడిరి.

"అఖిలభారత గ్రంథాలయసంఘము" పక్షమున ప్రకటింపబడిన "గ్రంథాలయపత్రిక"కుగూడ ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు అనేకవిధముల దోహదపడిరి. అఖిలభారత గ్రంథాలయసంఘమువారిచే కొన్ని కరపత్రములుగూడ ప్రకటింపబడినవి.

**1927** సంవత్సరము డిశంబరునెలయందు మదరాసు నగరమున కాంగ్రెసు మహాసభ జరగినప్పుడు, అఖిల భారత గ్రంథాలయసభనుగూడ సమావేశము చేయవలసినదని మదరాసు రాజధానియందలి వివిధభాగముల నుండి పెక్కుమందియేగాక వంగదేశమునుండి కూడ కొందరు ఉత్తరములను వ్రాసిరి. అందుమీద, అఖిల భారత గ్రంథాలయసభను సమావేశము చేయుటకు ఏర్పాటులను చేయవలసినదని పలువురు మిత్రులకు నేనే స్వయముగా ఉత్తరములను వ్రాసితిని. పుదుక్కోట గ్రంథాలయసంఘ కార్యదర్శియగు ఏ. యస్. ముత్తుకృష్ణనుగారుకూడ మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు గ్రంథభాండాగారియగు యస్. ఆర్. రంగనాథనుగారికి వ్రాసిరి. వారును సభను జరుపుటకు బొత్తిగా వీలులేదని ప్రత్యుత్తరమిచ్చిరి. అంతట ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శియు, అఖిల భారత గ్రంథాలయసంఘ కార్యదర్శియునగు నేనే మదరాసునకు ముందుగాబోయి, అఖిలభారత గ్రంథాలయసభను, శ్రీరంగనాథనుగారి తోడ్పాటుతో ప్రద

ర్పవమును ఏర్పాటుచేసితిని. ఆసభకు అహ్వాన సంఘాధ్యక్షులు ఇప్పుడు మదారాసు గ్రంథాలయ సంఘాధ్యక్షులగు కే. వి. కృష్ణస్వామి అయ్యరుగారు. ఆసభను జరిపినపిమ్మట మదారాసునందు గ్రంథాలయోద్యమమును వ్యాపింప జేయుటకుగాను గ్రంథాలయోద్యమాభిమానుల సభ నొకదానిని శ్రీకృష్ణస్వామిఅయ్యరుగారి ఇంటియందు నేనే సమావేశము జేసితిని. ఆసమావేశమునందు ఆంధ్రదేశగ్రంథాలయోద్యమమును గూర్చియు బరోడా గ్రంథాలయోద్యమమును గూర్చియు జెప్పితిని. ఆ సభయందే మదారాసునందు గ్రంథాలయ సంఘమును ఏర్పరచుటకై తాత్కాలికసంఘము ఏర్పరుపబడినది. అదియే పిమ్మట ప్రస్తుత మదారాసు గ్రంథాలయసంఘముగ పెరిగినది.

ఈ రీతిగా ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము ఆంధ్రదేశమునందలి గ్రంథాలయోద్యమ వ్యాప్తికే గాక, అఖిలభారత గ్రంథాలయోద్యమ వ్యాప్తికి గూడ తనశక్తికొలది పాటుపడి, సత్ఫలితములను జూపినది.

## మనయుద్యమ ప్రాశస్త్యము.

గుంటూరునందు జరిగిన ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభయొక్క వృత్తాంతమును ప్రకటించుచు, అమెరికాదేశమునందు ప్రకటింపబడుచున్న గ్రంథాలయపత్రిక (Library journal for October 15th 1928.) తన సంపాదకీయమునందు మన యుద్యమమును గూర్చి ఇట్లు వ్రాసియున్నది:—

“బరోడా మహారాజాగారు తన సంస్థానమునందు గ్రంథాలయవిధానమును పెంపొందింపజేయుటకు తగిన అవకాశమును కల్పించిన సమయమున బోర్డను దొరవారు విత్తనమును నాటకమునుపే, హిందూదేశమునందును స్వశక్తిచేతనే యథేష్టముగ ఫలప్రదము గాంచిన ధర్మగ్రంథాలయోద్యమము ప్రారంభమయినది. అఖిలభారత గ్రంథాలయసంఘమునకుపరి జిల్లాసంఘములు విశేషముగా పౌరగ్రంథాలయములు గలవు. గ్రంథాలయముయొక్క విధానములను పెంపుచేసి, గ్రంథాలయోద్యమమును సర్వవిధముల ఆధునిక పద్ధతుల ననుసరించి అభివృద్ధి చేయుటయే అట్టి గ్రంథాలయములయొక్క ఆశయము. ఇట్టి అఖిలభారత గ్రంథాలయసంఘ మేర్పడుటకు జాతీయభావముకూడ కొంతవరకు కారణమే. కొద్దికాలముక్రిందనే జరిగిన సభలో చెప్పబడిన ఉపన్యాసములు ఈ దేశములో (అమెరికాలో) ఈమాదిరి ఇతరసభలలో చెప్పబడిన ఉపన్యాసములకు మిక్కిలి సన్నిహితముగానున్నవనియే చెప్పనగును. అట్టి ఉపన్యాసములు హిందూదేశ నివాసులచే చెప్పబడిన వనుట చాలాగొప్పవిషయము. అమెరికాదేశమును ఆదర్శముగాగొని చీనాదేశము చాలవరకు అభివృద్ధి జెందినది. జపానుదేశము యీవిషయమైన అభివృద్ధి జెందుటకై స్వశక్తిమీదనే ఆధారపడియుండెను. బోర్డనుగారు బరోడాయందు కృషిజేసిరి. ఇండియాప్రభుత్వమువారికిగాను పంజాబు గ్రంథాలయములను డికెన్‌సన్‌గారు చక్కబెట్టిరి. ఇంతకుతప్ప హిందూదేశము అమెరికాదేశమునుండి చీనా పొందిన రీతిగా సహాయమును పొందలేదు. హిందూదేశమున జరిగిన అభివృద్ధియంతయు జపానుదేశమునందువలెనే విశేషభాగము దేశీయమైయున్నది. ఈమూడుదేశములయందలి గ్రంథాలయోద్యమాభివృద్ధి మార్గములు, అమెరికాదేశపద్ధతులకును ఆదర్శములకును సమానముగాను భిన్నముగానుకూడ నున్నవని కానవగును.”

మదారాసునందు జరిగిన అఖిలభారత గ్రంథాలయ సభకు అహ్వానసంఘాధ్యక్షులును, ప్రస్తుతము మదరాసు గ్రంథాలయసంఘమునకు అధ్యక్షులును అగు కే. వి. కృష్ణస్వామి అయ్యరుగారు తమ అహ్వాన సంఘాధ్యక్షోపన్యాసమునందు ఆంధ్రగ్రంథాలయోద్యమమును గూర్చి ఇట్లు జెప్పియున్నారు.

“ఈవిషయములో ఆంధ్రదేశము చాలా అభివృద్ధిగాంచి, ముందంజవేసి, యితరులకు మార్గదర్శకమై యున్నదని జెప్పుటకు మిక్కిలి తృప్తికరముగానున్నది. పేరెన్నికగన్న దేశసేవకుల అలయికలేని ప్రయత్నముల వల్ల ఆంధ్రదేశమునందు ధర్మ పౌరగ్రంథాలయములు జయప్రదముగా నిర్మింపబడినవి. జాతీయభావమును బట్టి జూచినను, స్వభాషాభిమానమునుబట్టి జూచినను దాని యభివృద్ధినిబట్టి జూచినను ఈసంఘములు ఎట్లు సత్ఫలితములనొసంగినదియు బోధపడగలదు. ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రతయు, స్వారాజ్యార్హతయు కలదని చెప్పుటకు వారు సమర్థతతో నిర్వహించిన గ్రంథాలయోద్యమాభివృద్ధియే తార్కాణము. తమిళసోదరులును ఇతరులును ఆంధ్రులవిధానమును గ్రహించి, వారివలెనే ఈ యుద్యమాభివృద్ధి గావించెదరుగాక.”

## మదరాసు గ్రంథాలయసంఘమువారి అన్యాయ ప్రచారము

ఇటీవల మద్రాసు గ్రంథాలయ సంఘముయొక్క కార్యదర్శిగారగు యస్. ఆర్. రంగనాథన్ గారిచే వ్రాయబడిన "గ్రంథాలయ శాస్త్రముయొక్క అయిదు సూత్రములు" అను గ్రంథమును మద్రాసు గ్రంథాలయ సంఘమువారే ప్రకటించిరి. అఖిలభారత గ్రంథాలయోద్యమముగాని ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమముగాని ఈ గ్రంథకర్తగారి దృష్టి నాకర్షింపకపోవుట మిక్కిలి శోచనీయము. వారిదృష్టి నాకర్షించిన ఆంధ్రదేశమును గూర్చి యిట్లు వ్రాసిరి.

"ఇంకను దక్షిణమునకు పోయిన, ఆంధ్రదేశమందు కడచిన పది సంవత్సరముల ఆఖరున గ్రంథాలయములను సుభిక్షమైన పంట పండినది. కాని కొంతవరకు రాజకీయ ఉద్యమమునందు కలసిపోయి దానియొక్క విపర్యయమువలన అరిగిపోయి నశించుచున్న కొన్ని శకలములను మాత్రము మనము చూచుచున్నాము."

వీరు వ్రాసిన వాక్యములు కొన్ని గ్రంథాలయములను గూర్చి ప్రత్యేకముగా వ్రాయబడినవి గాక, ఆంధ్రదేశము నంతను గూర్చి వ్రాయబడిన మిక్కిలి అన్యాయముగా వ్రాతలైయున్నవి. ఒక విషయమును గురించిగాని ఒక దేశమునుగూర్చిగాని వ్రాయుటకు ముందుగా వానిని గురించి తెలిసికొనుటకు కొంచమైన ప్రయత్నింపవలయును. అమెరికాదేశమునందు ప్రబలియున్న నవీన గ్రంథాలయ పద్ధతులను గూర్చి ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునందు ఇతరులు జూచుట సంభవమైయుండె (అమెరికా దేశ గ్రంథాలయ పత్రికనుండి ప్రకటితమైన వాక్యములను జూడుము) ఇరుగుపొరుగున నున్న ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమును, ఆంధ్రదేశమందు ప్రబలియున్న వందలకొలదిగాగల గ్రామగ్రంథాలయములను, ఈ మదరాసు గ్రంథాలయసంఘకార్యదర్శిగారు చూడలేకుండుట మిక్కిలి శోచనీయము. ఈ గ్రంథము మదరాసు గ్రంథాలయ సంఘముచే ప్రకటింపబడినది. ఈ మద్రాసుగ్రంథాలయ సంఘాధ్యక్షులు 1927 వ సంవత్సరము డిశంబరు నెలయందు అఖిలభారత గ్రంథాలయ సభయొక్క ఆహ్వానసంఘాధ్యక్షులుగా ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమును గూర్చి చెప్పినసంగతులను పైన వింటిరిగదా? అప్పుడు వీరు చెప్పిన అభిప్రాయములను ఇప్పుడు మార్చుకొనిరా? మార్చుకొననియెడల తాము అధ్యక్షులుగానున్న సంఘముయొక్క కార్యదర్శిగారు విచారించక తెలిసికొనక వ్రాసిన వ్రాతను వీరైన సవరించి యుండవలసినది. జవాబుదారీ గల సంఘపక్షమున ప్రకటింపబడు గ్రంథములయందిట్టి అపనిందలుండుట మర్యాదగాదు. ఈ గ్రంథకర్తగారు వ్రాసిన అన్యాయపు వ్రాతను ఇప్పుడైన సవరించుకొనెదరని కోరెదను.

## గ్రంథాలయోద్యమము భాషాప్రయుక్తముగా నుండవలెను.

ఏకభాషను మాట్లాడు జనులందరును ఏకరాష్ట్రముగా ఏర్పడి యుండవలెనను సిద్ధాంతము సర్వజనాంగీకృతమై యుండుటచేత దానిని నే నిప్పుడు నిరూపింపవలసినది లేదు. ఈ సిద్ధాంతము ననుసరించియే ఇదివరకు కాంగ్రెసునందేమి తదితర యుద్యమములయందేమి, కార్యక్రమము భాషాప్రయుక్తముగ జరుగుచున్నది. 1919 సంవత్సరమునందు ఏర్పడిన అఖిల భారత గ్రంథాలయసంఘముయొక్క నిబంధనలయందు బ్రిటిషు రాజ్యములో ఒకభాషను మాట్లాడు దేశమంతకును ఒక రాష్ట్రీయ గ్రంథాలయ సంఘము ఏర్పడవలెనని గలదు. ఈ సాంప్రదాయమునకు, ఈ నిబంధనలకు విరుద్ధముగ మద్రాసుగ్రంథాలయ సంఘమువారు వర్తించుచుండుట మిక్కిలి విచారింపదగిన యంశమై యున్నది. ఈ సంఘమువారు తమయొక్క నిర్మాణమును ఒకభాషాప్రయుక్త విభాగమునకు చెందినదిగా ఏర్పరచి యుండిన యెడల న్యాయముగ నుండియుండెడిది. లేదా ఈ రాజధానియందున్న వివిధభాషలను వివిధరాష్ట్రీయ సంఘములేర్పడుటకు నావకాశమిచ్చి, అట్టి వివిధభాషా ప్రయుక్త సంఘముల కొక సంయుక్త సంఘమును నిర్మాణము గావించినను బాగుగా నుండెడిది. ఈ మదరాసు గ్రంథాలయ సంఘమువారు ఈ రెండుపద్ధతులలో దేనినిగూడ నవలంబింపక, తమ బాహువులను మదరాసురాష్ట్రమునందున్న అన్ని భాషాప్రయుక్త ప్రదేశములకు చాచుటకై ప్రయత్నించిరిగాని వారి ప్రయత్నము జయప్రదమైనట్లు గాన్పింపదు.

మదరాసు గ్రంథాలయ సంఘముయొక్క తృతీయ సంవత్సర కార్యక్రమమును ప్రారంభించుచు మద్రాసు గవర్నరుగారగు సర్ జార్జి ఫెడరిక్ స్టాన్లీగారు ఏమని చెప్పిరో చిత్తగింపుడు:—

"ప్రారంభమునందే కొన్ని కష్టములను ఎదుర్కొనవలసి యున్నదనియు; ముఖ్యముగా భాషావిషయకమైన

కష్టము కలదనియు, మీ నివేదికనుబట్టి గ్రహించితిని. ఈ రాజధాని మిక్కిలి విశాలమైనది. 420 లక్షలు జనసంఖ్యను గలిగియున్నది. ఇచట నాలుగు ముఖ్యమైన దేశభాషలున్నవి. ఈ రాజధానియందున్నవి కొన్ని గ్రంథాలయములైనను పెక్కుమంది వచ్చి చదువుకొనుటకు అందుబాటులో లేవు.

అదియునుగాక, ఒక్కొక్క భాషయందు మంచి గ్రంథాలయమొకటిగూడ యున్నదని చెప్పుటకు వీలులేదు. ఆంగ్లేయభాష అనుకూలమగు వాహకమని నాకు తెలియును. కాని వివిధ దేశభాషలలో వ్రాయబడిన వాఙ్మయమును చింతనచేయుటకు సదుపాయములున్నగాని, ఈ దేశముయొక్క దేశీయవిజ్ఞానము పూర్తిగా వికసించుటకు సావకాశముండదు. మీరు నిర్వహింపవలసిన కార్యము మహాభారమైనది. ఏలయనగా, ఇంత మంది ప్రజలకు గ్రంథాలయములలో ఆంగ్లేయ గ్రంథములనుంచుటయే గాక, అరవవారికి అరవగ్రంథములు, తెలుగువారికి తెలుగు గ్రంథములు, కన్నడదేశస్థులకు కన్నడ గ్రంథములు, బహుశః హిందూస్థానీ భాష మాట్లాడువారికి హిందూస్థానీ గ్రంథములు సమకూర్చవలసి యుండును. మీరాపని ఒకరోజులో పూర్తియగునదిగాదు. మీరు స్థాపించు ప్రతి గ్రంథాలయమును కొంతవరకు ఈ పనికి తోడ్పడుచుండును. ఇంకను బహిర్గతముగాని గొప్పవిషయములనేకములు దక్షిణ ఇండియా వాఙ్మయమునందు గలవని మనము తరుచుగా వినుచుందుము. అట్టి వాఙ్మయమును ప్రాముఖ్యతకు దీసికొని రావలెనన్నచో ఇట్టి యుద్యమమే తోడ్పడును......"

శ్రీ గవర్నరుగారు చెప్పిన పైవిషయములను మనము పరిశీలన చేసినయెడల, ఈ యుద్యమము భాషాప్రయుక్తముగ నుండుట యొక్క అవశ్యకత ఇంకను స్ఫుటముగ గోచరింపగలదు. ఇంత విశాలమైన రాష్ట్రమున, ఇన్ని ముఖ్యమగు భాషలు వ్యాపించియున్న రాష్ట్రమున దేశభాషలలో దేశీయ విజ్ఞానము, దేశీయ వాఙ్మయము పెంపొందవలసిన అవసరమున భాషాప్రయుక్త సిద్ధాంతమును త్రోసిరాజని, ఈ రాజధానినంతను ఒకే సంఘము ఆవరింపబూనుట అతిసాహసమని చెప్పక తప్పదు.

## మద్రాసు గ్రంథాలయ చట్టము.

పాశ్చాత్యదేశములందు గ్రంథాలయ ఉద్యమమును స్థానిక సంస్థలు నడపుటకుగాను ప్రత్యేకముగా పన్నును విధించుకొనవచ్చును. అట్టిపన్నును విధించుటకు ప్రత్యేకము చట్టముగూడ గలదు. అదేరీతి మద్రాసు రాజధానియందుగూడ గ్రంథాలయోద్యమమును స్థానిక సంస్థలు నడుపుటకై చట్టము నొకదానిని మద్రాసు గ్రంథాలయ సంఘమువారు తయారుచేసినారు. ఆచట్టమును అప్పుడే కొందరు చట్టనిర్మాణసభయందు గూడ పెట్టుటకు బూనుకొనుచున్నారు. నిర్బంధ ఉచిత ప్రారంభ విద్యాచట్టము చాలకాలమునుండి అమలులో నున్నను మన రాజధానియందది ఆచరణలోనికి రాలేదు. గ్రంథాలయ చట్టముగూడ అదేమాదిరి గాకుండ జూడవలయును. ఇంకొక విషయమునుగూడ మనము పర్యాలోచింపవలసియున్నది. పల్లెటూళ్లయందేగాక, పట్టణములయందు మునిసిపల్ పన్నులుగూడ హెచ్చుగానున్నవని ఘోషగనున్నది. దీనికితోడు ఆర్థిక విపర్యాసముల వలన దేశమంతయు అల్లకల్లోలముగ నున్నది. ఇట్టి సమయమున, స్వతంత్ర పాశ్చాత్య దేశములయొక్క దృష్టాంతరముల గైకొని, క్రొత్తపన్నును విధించు ఇట్టి చట్టమును ఈపరిస్థితికాలమున పెట్టబూనుట దూరదృష్టి నెంతమాత్రమును జూపుటలేదు. ఇట్టి చట్టము హిందూదేశమునందెక్కడను లేదు. ఇట్టి చట్టనిర్మాణమునకు ఇదే ప్రారంభమగుటచేత, అనుకూలపరిస్థితులయందు ప్రారంభింపజేయుట మంచిది. ఇట్టి చట్టమును ప్రస్తుత పరిస్థితులయందు చేయుటయే యుక్తమని పెద్దలు తలంచినయెడల, అది యీ రాజధానియందున్న వివిధభాషల యొక్క వివిధరకములైన జనులయొక్క వికాసమునకు దోహదమునిచ్చునదియై యుండవలయును. అట్టిదోహదచిహ్నము లేమియు, ఈ చిత్తుచట్టమునందు గన్పించుటలేదు. కావున చట్టనిర్మాతలు బాగుగా యోచింతురుగాక.

## ముందుచేయవలసిన కార్యక్రమము

సోదరులారా, సోదరీమణులారా! ముందు మనము గ్రంథాలయోద్యమాభివృద్ధికిగాను చేయవలసిన కార్యక్రమముయొక్క ప్రాతిపదికయంతయు, ఇంతవరకు జరిగిన అల్పారంభములయందే గలదు. మీయందలి గ్రంథాలయ సంఘము ఇంకను ఎక్కువ శక్తివంతమైనదిగా చేయవలయును. తాలూకా గ్రంథాలయసంఘములు పట్టణగ్రంథాలయసంఘములను స్థాపించవలెను. ఇంతవరకు గ్రంథాలయోద్యమమునందు ప్రచారభాగము నెక్కువ జరిపితిమి. ఇకముందు కొన్ని కొన్ని ప్రదేశములందు ఈ యుద్యమముయొక్క వివిధాంతరములను ఆచరణయందు జూపి ఉద్యమప్రాశస్త్యము

నకు దోహదపడవలయును. ఇందుకై గ్రంథాలయోద్యమ సోదరులకు మీ జిల్లాయందు తాత్కాలిక తరిబీతు పాఠశాల నొకదానిని ఒక నెలదినములకు తక్కువలేని కాలమునకు ఏర్పరచెదరని కోరెదను. ముఖ్యముగా గ్రామములందుండు గ్రంథాలయములు గ్రామమునందుండు జనులందరికిని అందుబాటులో నుండవలెను. వానిలోని గ్రంథములు గ్రామములోని జనులందరికి చందా ఇచ్చినవారికి ఇవ్వనివారికి గూడ ఇవ్వవలయును. జ్ఞానమునకును మానవునకును మధ్య ద్రవ్యము వచ్చి ప్రవేశింపగూడదు. గ్రంథాలయమునకు చందాలు ముఖ్యముగా పల్లెటూళ్లయందు ద్రవ్యరూపమున వసూలు చేయరాదు వస్తురూపమున అనగా ఎవరికే సంటపండునో ఆ ధాన్యరూపమునవనే వసూలుపరుపవలెను. ఇంకను గ్రామధర్మాదాయనిధులు - వర్తకుల ధర్మఖాతాలు - సహకార సంఘములు- అన్నియు గ్రంథాలయసాహాయ్యమునకు చేయూతయొసంగునటుల చేయవలయును. ముఖ్యముగా తాలూకా బోర్డులును, మునిసిపాలిటీలును, తమచే పరిపాలింపబడు ఉపాధ్యాయుల మూలమున నీయుద్యమమును బాగుగా వ్యాపింప చేయవచ్చును. తమ పాఠశాలాగ్రంథాలయములను బాలురకేగాక యింకను ఆ గ్రామమందలి జనులకు గూడ అందుబాటులో నుండునటుల చేయవలయును. అట్లు చేయవలెనన్నచో పాఠశాలాగ్రంథాలయములను బాగుగా అభివృద్ధి చేయవలయును. మరియు, వానికి వార్తాపత్రికలనుగూడ తెప్పింపవలెను. ప్రతి తాలూకా బోర్డును కొన్ని సంచార గ్రంథాలయ పేటికలను సేకరించి, ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయుల మూలమున గ్రామస్థులచేత చదివింప చేయవచ్చును. ఈ యుపాధ్యాయులు అప్పుడప్పుడు సెంటరుక్లాసులందు కలిసికొనుచుండెదరు. అప్పుడు వివిధగ్రామములందలి యుపాధ్యాయులు ఆదివరకు తమ గ్రామస్థులు చదివివేసిన పెట్టెలను, అచటికి తీసికొనివచ్చి, క్రొత్త పెట్టెలను మరల తమ గ్రామములకు తీసికొనిపోవచ్చును. ఈ పని నిమిత్తమై ఒక్కొక్క తాలూకాబోర్డువారు సంవత్సరమునకు రు 1000 లకైన వ్యయపరచుటకు అంగీకరించునెడల కొంతపనిని జేసి జూపవచ్చును. మీ జిల్లాలయందు రెండువేలకంటె తక్కువ జనాభాలేని గ్రామమందెల్ల ధర్మగ్రంథాలయము వెలయవలయును.

ఈ కార్యము జరిగినదాకా, మనము గ్రంథాలయోద్యమమునందు మొకటిమెట్టయినను ఎక్కినట్లు కాజాలము.

### ముగింపు

గ్రంథాలయోద్యమము ఆంధ్రదేశమున ఏయే పరిస్థితులయందభివృద్ధిగాంచుచున్నదో అట్టిది ఇతర దేశములయందెచటను గానరాదు. బరోడారాజ్యమునందైనను, ప్రభువుల తోడ్పాటు తోడనే, గ్రంథాలయములు స్థాపింపబడి పోషింపబడుచున్నవి.

మనదేశమున కార్నెజీ మహాశయునివంటి దాతలదాతృత్వ మింకను ఈ యుద్యమమువైపునకు తిరుగలేదు. ప్రభువుల తోడ్పాటు సముద్రములోని నీటిబిందువువలెనున్నది. నేను ఇదివరకే తెలుపసూచించినరీతిని, ఉత్సాహవంతులగు యువకుల తీవ్రకష్ట పరంపరలవలననే ఈ యుద్యమము నిర్వహింపబడుచున్నది.

గ్రంథాలయ నిర్వాహకులీ యాటంకములను కష్టములను సరకుసేయక తమ ప్రజాసంకల్పము సఫలమగుదాక, మిక్కిలి ఉత్సాహముతో తమధర్మములను నిర్వర్తింతురుగాక.

"సీ. అక్షరాస్యునకు, నిరక్షరాస్యునకు
విద్య బోధమై కలయవలయు
ధనమున్న లేకున్న తగినగ్రంథము జూచి
నభిలాషగల యప్పు డమరవలయు
పసుల కొక్కవచేరి భాషించుకరవాణి
భువనమోహిని యాచు బోదలవలయు
వీనుల విందైన వీక్షణంబుల నైన
మంచిచెడ్డలవృష్టి మనుపవలయు
గీ. దేశమెల్లెడ విజ్ఞాన దీపవితతి
వెలయునది యెల్ల గనుపింప వెలుగవలయు
భుక్తియును ముక్తియు మహోన్నతి మెలగ
గ్రంథభాండారములు భువి గ్రాలవలయు!!

# 15 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ,

## బెజవాడ.

## ఆగష్టు 10 వ తేదీ, 1933 సం.

ఈ రోజు ఉదయము 8 గంటలకు రామమోహన ధర్మపుస్తక భాండాగారమునందు 15 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సమావేశమైనది. సభాభవనమంతయు తోరణములతోను గ్రంథాలయోద్యమ ఉద్బోధక వాక్యములతోను అలంకరింపబడెను. ఆంధ్రదేశమందలి వివిధజిల్లాలనుండి ప్రతినిధులు విచ్చేసిరి. మొదట ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీయుత గోపు రామచంద్రరావుగారు సభను ప్రారంభించుచు నుపన్యసించిరి. పిమ్మట గుంటూరు మునిసిపల్ చైర్మన్ నడింపల్లి నరసింహారావు పంతులుగారు సభాప్రారంభోత్సవమును జరిపిరి. తరువాత అధ్యక్షులగు భూపతిరాజు సీతారామరాజు, బార్-ఎట్-లా; యం. యల్. ఎ. గారు అధ్యక్షోపన్యాసమును గావించిరి. అంతటితో సభముగింపబడి సాయంత్రము 3-30 గంటలకు తిరుగ సమావేశమయినప్పుడు శ్రీయుతులు వంగిపురపు జగన్నాధరావుగారు, కలిదిండి నరసింహారావుగారు, శ్రీమతి. మిస్ సామియేలు (మద్రాసు). స్త్రీల కళాశాలయందు గ్రంథభాండాగారిణిగారు గ్రంథాలయములు-వాటి యావశ్యకతను గురించి విపులముగా ముచ్చటించిరి.

ఆహ్వానసంఘాధ్యక్షులగు

### శ్రీయుత గోపు రామచంద్రరావు శ్రేష్ఠిగారి యుపన్యాసము.

సభాధ్యక్షులకు, ప్రతినిధులకు, ప్రేక్షకులకు స్వాగతము. నేడు విజయవాటియందు పదునైదవపర్యాయము ఆంధ్రరాష్ట్రగ్రంథాలయమహాసభ కూడి యున్నది. పుష్కర మహాభాగ్యముతో పుష్కరముపై మూడుసంవత్సరములు వెనుక జరిగిన గ్రంథాలయసభావైభవమును స్మరింప జేయుచున్నదో యనునటుల నీ సభాసమావేశ మిచట జరుగుట మాపౌరులకు సంతోషదాయకము. గ్రంథపురాణేతిహాసకథా వర్గశాఖోపశోభితమై నైసర్గిక సౌందర్యసమోపేతమయి బౌద్ధ, ఆంధ్ర, మహమ్మదీయ ఘ్రంచి చారిత్రక విశేషముల కునికిపట్టయి లలితకళల కాలవాలమయి, కృష్ణానదీపునీతమై విరాజిల్లు విజయవాటి మీకు స్వాగతమిచ్చుచున్నది. 15 సంవత్సరముల క్రిందట ప్రథమ ఆంధ్రరాష్ట్రీయ గ్రంథాలయాహ్వాన సంఘాధ్యక్షపదవి వహించి ఈ యుద్యమస్థాపనాచార్యుడయి వెలసి రామమోహన గ్రంథాలయమున అధ్యక్షుడై, గ్రంథాలయోద్యమమునకు ఆదిపురుషుడై విజ్ఞానాభివృద్ధికి చేయూతనిచ్చి అఖిలభారత గ్రంథాలయోద్యమమునకు బీజములనాటి ప్రతివర్షమున మహాసభలను జరిపి స్వదేశ సంస్థానములచే మన్ననల బడసి దేశసేవచేసి కృతకృత్యులయిన బ్ర॥శ్రీ సూరి వేంకట నృసింహశాస్త్రిగారి అకాలనిర్యాణమునకు కడుచింతిల్లుచున్నాను. వారి ఆత్మకు పరమేశ్వరుడు శాంతినొసంగుగాక. సభాసదులారా! గ్రంథాలయోద్యమము నేటికి సుమారు 25 సంవత్సరములనుండి అవిచ్ఛిన్నముగా నడుచుచున్నది. ఉద్యమవ్యాప్తిని పరిగణించుట ఆహ్వానసంఘాధ్యక్షుని పనిగాకున్నను గ్రంథాలయోద్యమ లాభాలాభములను పరిస్థితులను సింహావలోకనము చేయుట యాచారమగుచున్నది. ఆంధ్రరాష్ట్రమున నేమి మరి ఏదేశమునందేమి, గ్రంథాలయములు విజ్ఞానాభివృద్ధికి సహాయభూతములు. జ్ఞానసంపాదనకు ముఖ్యోపకరణములు. గ్రంథాలయములు సహజముగా ఐచ్ఛికవృద్ధి పొందవలసిన సంస్థలైనను ప్రస్తుత ప్రాపించిన భావపరినగనచేతను రాజ్యాంగ నిర్వహణ సూత్రవైశేష్యముచేతను గ్రంథాలయోద్యమ ప్రచారభారము రాజ్యాధికారుల మీదకూడ నున్నదనుటకు సందియములేదు. వ్యక్తి ప్రకృతమున సమష్ట్యాంబుధియందు బిందువువలె నున్నాడు. సమష్టిజీవనమున ఏకమై, దాని వైశాల్యమునకు, ప్రతిభకు తోడ్పడుచున్నాడు. వ్యక్తిజీవనమునకు ప్రత్యేక ప్రాముఖ్యము క్షీణించుచున్నది. సమాఖ్య ప్రతిభ హెచ్చుచున్నది. కనుకనే సమష్టిసంస్థ లుపయోగకరము లగుట

లతో కలుపుట ఆక్రమము; అన్యాయము; అనాలోచితము. ప్రభుత్వమువారు ప్రత్యేకశాఖను నిర్మించి గ్రంథాలయప్రచారాలను చేయుటకు తగు అవకాశమును గలిగించిననే గాని, మదరాసు గ్రంథాలయచట్టము ప్రజాభివృద్ధికి సహాయకారి కాజాలదు. మరియు అనేక మతభాషా సంక్షుభిత దేశమందలియు కల్లోలముగనున్న యీదినములలో గ్రంథాలయాభివృద్ధికొరకు వేరుపన్నులు వేయవలయుననుట, సంకుచిత రాజ్యాంగ పరిచయమును సూచించుచున్నది. ఇటువంటి లోపములు అన్నియు సవరణచేయబడి శ్రీయుత బషీరహమ్మదుగారి బిల్లు సర్వవిషయముల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడునని భావించుచు, సర్వజ్ఞుడగు భగవంతుడు ఆంధ్రగ్రంథాలయ మహాసభను జయప్రదముగా జేయుగాతమని ప్రార్థించుచు విరమించుచున్నాను.

## గుంటూరు పురపాలకసంఘాధ్యక్షులు లగు
## శ్రీయుత నడింపల్లి వేంకట లక్ష్మీనరసింహారావు పంతులుగారి
## ప్రారంభోపన్యాసము.

మన సాంప్రదాయము ప్రకారము ఏ పండితుడో, వేదవేత్తయో, ఈ మహాసభలను ఆశీర్వదించుట ధర్మము. పాశ్చాత్యపద్ధతి ననుసరించి నన్ను ప్రారంభింపుమని కోరుట; నేను ప్రారంభింపవలయుట సాహసకృత్యములే. సభాసభ్యులు దైవస్వరూపులు. వారి ఆజ్ఞను శిరసావహించుట నాబోటివంటివాని ధర్మము.

గ్రంథాలయసంస్థ మాతృసంస్థ. ఇందుండియే అనేక పిల్లసంస్థలు ఉద్భవించుచున్నవి. గ్రంథాలయములందుండిన గ్రంథములందుండిన విద్యావిశాలురు పరిశీలనాశిష్టులు ఉత్తేజమును బడయగలరు. జాతీయాదర్శము గలవారు గ్రంథపఠనమువలన జాతీయజీవముద్ధారక ప్రబోధమును గావింతురు. ఆర్థికాభివృద్ధి నభిమానించువారు తదభివృద్ధికి సహాయపడుదురు. ఆధ్యాత్మిక చింతనము నను మోక్షాదర్శకముగ గ్రంథములను బరికించి నూతనమార్గ స్థాపనమును గావించుచుందురు.

ఈ గ్రంథాలయోద్యమమున సామాన్యముగా గొన్ని పుస్తకములనుజేర్చి గ్రంథాలయమును స్థాపించుట, దాని నాధారపరచుకొని దేశసేవ, సంఘసేవ మొదలగు మానవసేవను జేయుట ఆచారమయి పోయినది. ఈ ఉద్యమమును తలంచిన నిరువురు కంటికి గనుపట్టుదురు. అందొకరు అయ్యంకి వేంకటరమణయ్యగారు, రెండవవారు ఊటుకూరి వెంకట సుబ్బారావు శ్రేష్ఠిగారు. వీరిరువురును తమస్థానమును వదలక తమ ఉద్యమములయందే నిలచియున్నారు.

గ్రామములో వనము, నీరు, పంటలు, తోటలు దేవాలయములు గాంచిన నా గ్రామము మంచిదనియే తలంతుము; కోటలను, ఆఫీసులను గాంచినంతనే పట్టణమని తలంతుము. ముఖవర్చస్సునుబట్టియే మానవుని ఆరోగ్యమును జెప్పగలిగిన విధమున వారి అంతమును బట్టి బాగోగుల నారయగలము. ఏ దేశమైన ఉత్తేజకముగా నున్నదనిన వారి ఆదర్శము ననుసరించి యుండును. నాగరికజీవనము గల జాతియని తలతుము. పాశ్చాత్యదేశములలో గొప్పసంస్థలు గ్రంథాలయములు. కార్నెజీ గొప్ప గ్రంథాలయముల నెలకొల్పినాడు. అవియెల్ల సజీవముగా నుత్తేజకరముగా నున్నవి. ప్రజల ఉత్సాహమునుబట్టి, ఆర్థికస్థితినిబట్టి గ్రంథాలయ ఉద్యమము అభివృద్ధినందును. నిరుత్సాహులై దరిద్రులైయున్న దేశములో అభివృద్ధి కాలేదు. గ్రంథాలయములనుబట్టియే ఆదేశము, అజాతి బలహీనమో, బలిష్ఠమో ఉన్నస్థితిని నెరుగుచున్నదో గుర్తింపగలము.

ఈ ఉద్యమము మనకు గొప్పదే! జాతీయ సంస్థలు పుట్టిపెరుగకముందే గ్రంథాలయములు అభ్యున్నతినంది యున్నవి. అన్నింటికిని పుస్తకములే ఆధారము. ఇందులకు కారణము మనదేశములో విద్యగలవారు యువకులే గాయుండుటయే. విద్యలేనిచోట నీ ఉద్యమము వృద్ధిజెందుటకు వీలులేదు. ప్రతిమానవుడును అననేల, ప్రపంచకమును అనేకజన్మముల నెత్తుచున్నారు. పుస్తకమొక అవతారము. పూర్వీకులు మన పుస్తకరూపమున నున్నారు. ఏజీవి శాశ్వతత్వమును బడయదలచెనో ఆ జీవికి ఆతని గ్రంథములే శాశ్వతమగు స్థితి నిచ్చిన దన్నమాట.

మనము గ్రంథస్థము కాకపోయేమని మనమే లేమన్నమాట. మంచినే జేసితిమో, చెడ్డయే జేసితిమో యని సామాన్యముగా నాగరికతగలిగిన యేజాతియైనను తమ పూర్వచరిత్రను బరికించి దానిపై నభివృద్ధినంద బ్రయత్నించును. గ్రంథాలయము పవర్ హౌస్ (విద్యు

ద్గ్రహము); దీనిలోనుండియే జ్యోతి వెలువడగలదు. చిన్నయింటిలో దీపమువలె, విశాలవిశ్వము గ్రంథాలయములో నిమిడియున్నది. గ్రంథపఠనము కాలక్షేపమునకు చదువుట యొకవిధము. పాండిత్యమునకు జ్ఞానసముపార్జనమునకు చదువుట మరియొకవిధము; జ్ఞానసముపార్జనమునకు చదివిననే ప్రయోజనకారి కాగలదు. నివురుగప్పిన నిప్పువలె ఇది పవిత్రమయిన ఉద్యమమై వెలసిల్లినది.

ప్రతిసంవత్సరము సభలు జరుపుచున్నారు. దీనికి ప్రాముఖ్యమయిన స్థానము కలిగజేయ బడలేదు. ప్రాముఖ్యస్థానము నాక్రమించిన యితరోద్యమముల తీవ్రత యుండుటచే దీనికి (గ్రంథాలయోద్యమమునకు) ఇపుడు జరుగుచున్న ఆదరణ మత్యల్పము. అది చాలదు. దీనికి వెయ్యిరెట్లు ఉత్సాహప్రపూరితముగ నభివృద్ధి కావింపవలయును. ఇది వటవృక్షమువంటిది. ఇది బలవర్ధకౌషధము. ఇది శారీరకమే గాక మానసికబలవర్ధకము. దీనిని పాశ్చాత్యదేశములో జూచిననేగాని ఈ యుద్యమోన్నతస్థితి తెలియదు. ప్రతివానికిని తనయింట గ్రంథాలయము గలదు. ప్రతియింటికి వచ్చిన నాప్యాయనముగా జూపునది తమ గ్రంథాలయమే. మనపూర్వులు దేవతార్చన యొకనిత్యకృత్యముగా నుంచుచుండెడివారో వారును దీనిని అట్టులనే చూచుచున్నారు. దేవతార్చన మనగా సరస్వతీ ఆరాధనమే. వానివాని తాహతునుబట్టి కొలది గ్రంథములను సేకరింపనిండు. ప్రతివానికిని గ్రంథాలయ మత్యవసరము.

కాని కావలసిన ఉత్సాహములేదు, విరసమే కలదు. కేవలము గ్రంథాలయము అనగా అయ్యంకి వేంకటరమణయ్యగారి దేవతార్చనే అని ఆంధ్రులు వ్యవహరించుచున్నారు. కాని దానికి తగిన ప్రాముఖ్యత రాలేదు. అందుచేత ఇంతకన్న నధికప్రాశస్త్యమునకు ముఖ్యముగ నద్యోగమును త్తేజకరముగా గావింపవలయునని కోరుచు నా కొసంగిన ఈ గౌరవమునకు కృతజ్ఞతా వందనము లర్పించుచు ఈ మహాసభను సార్థకము చేయుదురని మనవి జేయుచు విరమించుచున్నాను.

## అధ్యక్షులగు : ప్రాంతశాసన సభ్యులగు భూపతిరాజు సీతారామరాజు, బారిస్టరు, యం. యల్. ఏ. (విశాఖపట్టణము) గారి ఉపన్యాసము.

ఈ సభకు అధ్యక్షుడుగానుండు గౌరవమును, జాతీయాభ్యుదయమునకు సహాయపడు జాతీయ విద్యలకగల యీయుద్యమము విషయమై తాముచేయుచున్న ప్రయత్నములలో సన్నిహితముగా పాల్గొను భాగ్యమును నా కొసగినందులకు నేనెంతయు కృతజ్ఞుడనై వందనము లాచరించుచున్నాను.

చిరకాలమునుండి విద్యాభివృద్ధికిని, విజ్ఞానవికాసమునకును నుండెడి ముఖ్యాంతరములు త్రోసివేసి స్త్రీపురుష తారతమ్యముల నెంచక జాతిభేదమును పాటింపక, జనసామాన్యమైన ప్రజల కెల్లరకును జ్ఞానోదయము కలుగజేయు యత్నములు వర్తమానకాలప్రయత్నములైయున్నవి. ఈ ప్రయత్నములు మన దేశమునందే గాక ప్రజాపరిపాలనాసౌకర్యములగు పనులెన్నియో కావించిన పశ్చిమదేశములలోకూడ వర్తమానకాల ప్రయత్నములే. ఇది ఒక వింతకాదు. అనేక సంవత్సరములనుండి, పశ్చిమదేశీయులు ప్రజలపురోభివృద్ధికి అనేకోద్యమములు తలపెట్టి పాటుపడుచుండెడివారైనను. మనవలె వారికిని స్త్రీపురుష విచక్షణజాతిభేదములు చిరకాలమునుండి నాటుకొనియుండిన కారణమున, జనసామాన్యమైన ప్రజల కందరకు విద్యాభివృద్ధి కలుగజేయు యత్నములు వర్తమానకాలముననేగాని, అంతకు పూర్వము ఆదేశీయులవలన కూడ ఆమోదింపబడి యుండలేదు. ప్రజాపాలనా సౌకర్యములకు పుట్టినిల్లనిచెప్పబడెడి ఆంగ్లేయ శాసనసభా ముఖమున, ఆంగ్లేయ రాచకీయ ధురంధరులు, జనసామాన్యమైన ప్రజలకెల్లరకును విద్యకరపుట శ్రేయస్కరమా కాదాయని యోచించుటయు, శ్రేయస్కరము కాదని అభిప్రాయపడుటయు కలదు. ఈమధ్య 1918 సం॥ లో ఆంగ్లేయశాసనసభలో విద్యావికాసమునకుగా నుపపాదింపబడిన చట్టముగూర్చి చర్చించునపుడు హెచ్. యె. యల్. ఫిషరు అను ఆ శాసన సభ్యుడు అట్టి ప్రయత్నము కూడదని వాదించు సందర్భములో "ప్రజలందరకు విద్యనేర్పిన గుఱ్ఱములకు పనియిచ్చువారెవరు, అప్పడాలు తీయువారెవరు, గొఱ్ఱెలు కాచువారెవరు, పొలముమీద గెత్తము పట్టుచువానికి చదువేల ?" అని చెప్పెనట. అట్టి మహానుభావులున్నను, ఈ యుద్యమము అమెరికాదేశ

దేశముగా భావింపవలయును. సామాన్యప్రజలందరును జ్ఞానోదయము పై చెప్పిన అన్నివిధములగు ప్రయత్నముల మూలమున జరుగవలయును. అట్టి ప్రయత్నములు సులభసాధ్యమైనవి కావు. ఇందుచేత జ్ఞానోదయము చేయుట యనునది విశేషముగా ప్రయాసపడి చేయు ఘనకార్యముగా తలంపవలయును.

## ప్రభుత్వసహాయము.

ఈ ప్రయత్నము లన్నియు కేవలము కొన్ని సంఘముల మీదను, కొందరు దేశసేవకులమీదను మాత్రము ఆధారపడి యుండునది కాదు. వారెంత ప్రయాసపడినను, ప్రభుత్వముయొక్క సహాయము చేతను శాసన సహాయము చేతను తోడ్పడినప్పుడు గాని యీ యుద్యమము పూర్తిగా నెరవేరుట సులభము. అట్టి సహాయము లేకున్నను ఆంధ్రదేశములో నింత స్వల్పకాలమునకైనను తీసికొని వచ్చుట శ్లాఘనీయము. ఇతర దేశములలో ప్రభుత్వము లన్నివిధముల దోడ్పడి యీ యుద్యమమును నిర్బంధ ప్రాథమిక విద్యతోపాటు జరుపుచున్నారు. మన దేశములో స్వతంత్రరాజుల పాలనక్రిందనున్న రాష్ట్రముల జూడ, ఈ ప్రయత్నము బరోడా సంస్థానములో నెక్కువ ప్రభుత్వముక్రింద, నిర్బంధవిద్యతో పాటు గ్రంథాలయోద్యమముకూడ అభివృద్ధిపరచబడెను. ఆ ప్రభుత్వముయొక్క సహాయముచేతను సానుభూతి చేతను యీ గ్రంథాలయోద్యమము బలపడి వారి రాజ్యములో నూటికి 60 మంది ప్రజలు ప్రస్తుతము లాభమును పొందుచున్నారు. ఆ దేశములో గల ప్రజ లందరకును విద్యాభివృద్ధియు యున్నతియు గలుగను పూనికతో బలపరుపబడుచున్నవి. స్వతంత్రరాజుల పాలనక్రిందనే యీ యుద్యమ మంతగా వృద్ధి గాంచగా బ్రిటిషువారలక్రింద నున్న రాష్ట్రములలో ప్రభుత్వసహాయ మంతగా లేక వృద్ధి గాంచకుండుట శోచనీయము.

ఈ దేశమునకు ప్రజాపాలనా సౌకర్యము లొసగ చేయగూడదని ద్వేషభావము వహించిన చర్చిలు మొదలగు ఆంగ్లేయ నాయకులైనను ఈ దేశములో అజ్ఞానులుగా నున్న సామాన్య ప్రజల కందరకును జ్ఞానోదయము చేయుట యత్యావశ్యక మనిరి. సామాన్య ప్రజ లందరకు విజ్ఞానోదయము చేయు ప్రయత్నములందు భిన్నాభిప్రాయములు లేవుకదా; ఇంతగా జ్ఞానోదయమునకు తోడుపడు నీ యుద్యమమునకు ప్రభుత్వము యేల తోడ్పడరాదు? ధనమా! ధనము లేదనరాదు. లాభ మంతగా కనబడని ప్రయత్నములందు వ్యయ పరచుచున్న ఖర్చులలోను, ప్రజల సంరక్షణ కొరకనియే సేనలకై వెచ్చించు ఖర్చులోను ఏ ఖర్చునకు నెంత? ప్రాథమిక విద్యావిషయమై ప్రభుత్వము కోట్లకొలది ధనము ఖర్చు చేయుచున్నను ఆధనమంతయు వృధాగా వినియోగ మగుచున్నదని కొంచెము యోజించిన తెలియగలదు. ప్రతి బాలునకు 5 లేక 6 సంవత్సరములు విద్య కలిపినమాత్రమున విద్యావంతుడు కాలేడు. అందువలన కలిగినవిద్య స్వల్పమై బడి విడచిపెట్టిన మరొక 6 సం॥లలో పునర్వృద్ధికి అవకాశములు లేక క్రమముగా నశించుచున్నది. ఆబాలునికి 16 వత్సరములు వచ్చి జీవయాత్ర స్వయముగా చేయబూను కాలమునకు తాను నేర్చిన విద్య నశించి, తాను పాఠశాలలో ప్రవేశించిన కాలమునకు తానెంత అజ్ఞానవంతుడుగా నుండెడివాడో అంత యజ్ఞానవంతుడుగాను చివర కుండును. కనుక ప్రాథమికవిద్యా ప్రసరణమందు వ్యయపడిన ధనమంతయు నీ విధముగా వృథా అగుచున్న దనుటలో సందియము లేదు.

ఇతర దేశములలో యీ సంగతి కనిపెట్టి ఆ ప్రభుత్వములు నేర్చిన విద్య పోకుండుటకుగాను యీ యుద్యమమునకు సహాయపడినట్లు మన ప్రభుత్వముకూడ సహాయపడ వలసినది ముఖ్యమైయున్నది.

## స్థానిక సంఘముల సానుభూతి

మనదేశములో స్థానిక సంఘములు అన్నిచోట్లను నెలకొల్పబడియున్నవి. ప్రాథమికవిద్య యీ సంఘముల యాజమాన్యముక్రింద నడుపబడుచున్నది. ఈ గ్రంథాలయోద్యమముకూడ యీ సంఘముల సానుభూతి బడసెనేని యీ ప్రయత్నములు శీఘ్రకాలములో కొనసాగగలవు. ప్రభుత్వ సహాయము బడయనేని విద్యాశాఖయొక్కయు ఆరోగ్యశాఖ యొక్కయు సహాయము బడయుటకు స్థానికసంఘములు ఉత్కృష్ట సాధనములుగా నున్నవి. ఈ సంఘముల యాజమాన్యము క్రింద నున్న పాఠశాలలలో ప్రతి గ్రామమునందును స్వల్పసంఖ్యగల గ్రంథములతో భాండాగారములు కలవు. వాటిని ఆధరవు చేసికొని గ్రంథాలయోద్యమము వృద్ధి గాంచుటకు అవకాశములు మిక్కిలి కలవు. పంజాబు రాజధానిలో గల స్థానికసంఘములు తమ పాఠశాలలలో గల గ్రంథకోశ

ములు ఆయా గ్రామ ప్రజలుకూడ ఉపయోగించు
కొనుటకు అవకాశములిచ్చి యీ యుద్యమమునకు
సహాయపడుతూయున్నట్లు తెలియవచ్చుచున్నది. మన
రాజధానిలో కొన్ని జిల్లా స్థానికసంఘములు గ్రంథా
లయసేవ చేయబూనినట్లు తెలియుచున్నది. బాహుళ్య
మైన మనదేశములో జిల్లాలుకూడ చాలా విస్తీర్ణముగ
కలవిగనుక జిల్లా కేంద్రస్థానముల నాదరవు చేసికొని
వ్యాపారము చేయుట కష్టము. ప్రతి తాలూకాలోను
కేంద్రస్థానము అవసరము. ఈవరకు కొన్ని యున్నవి.
తాలూకా లన్నిటిలోను కేంద్రస్థానము లుండుటయు
వాటి పనిపాట కనిపెట్టుటకు జిల్లా కేంద్రస్థానము
ఒకటి ప్రతి జిల్లాకు అవసరము కాకపోలేదు. జిల్లాస్థానిక
సంఘములకుగల ఆదాయము, ప్రచారసేవ మొదలు
గాగల ప్రయత్నములకు వారికిగల అవకాశములు,
మండ్రస్థముయొక్క కెలుగు పలుకుబడులు, ప్రభుత్వ
సహాయము బడయుటకు వారికిగల అవకాశములు,
తగిన ఉద్యోగీయులను నియమించి జిల్లాస్థలగతు లంత
యు గ్రహించు శక్తులుగలవన్న కారణముచే జిల్లాసం
ఘముల సానుభూతి ముఖ్యావసరము. మరియు జిల్లా
సంఘములు జిల్లాముఖ్యపట్టణము మాటుటవలన ప్రజా
సేవకుల యొక్కయు సంపన్నులగు నాయకులయొక్క
యు సానుభూతి సహకారములు బడసి వారిద్దన యవ
కాశములు హెచ్చుగకలవు. ఇంవరకే కావలసిన ప్రయ
త్నములు శీఘ్రకాలములోనే ప్రారంభింపబడి వృద్ధి
గాంచుగాక యని కోరుచున్నాను.

## పట్టణగ్రంథాలయోద్యమములు.

ఈ విజ్ఞానోపార్జన వ్యాపనము గ్రామములయందే
గాక పట్టణములయందుగూడ అవసరమై యున్నది.
పట్టణములలోకూడ అనేకులు విద్యాభ్యాసము లేనివారు
కలరు. విద్య నేర్చినవారికి పురోవృద్ధికి అవకాశము కలుగ
జేయు యత్నములు లేకపోవుట కలదు. కనుక గ్రామ
సమస్యలవలె పట్టణసమస్యలుకూడ సామాన్యప్రజల
కందరకును జ్ఞానోదయము కలుగజేయుటకు పాటుపడ
వలసియున్నది. మరియు విశేషసంఖ్యాకులుగా నుండెడి
పట్టణ వాస్తవ్యుల కుపయోగపడు ప్రయత్నములు
అనేకవిధములుగ నుండును. వీటికిని ప్రభుత్వముయొ
క్కయు పురపాలక సంఘములయొక్కయు సహా
యము ముఖ్యావసరముగా నుండును.

గ్రామసేవకు కేంద్రస్థానముగా నుండు పట్టణసంఘ
ములు తమపట్టణపు ప్రజలకే గాక తాము సేవచేయు
గ్రామప్రజలకూడ ఉపయోగపడు ప్రయత్నముల
న్నియు చేయుటకుగాను పూర్తిగా తమవిధులు నెర
వేర్చుకొనుటకుగాను విశేష ఆదాయముగల సంఘము
లుగా నుండవలెను. అందరకు ఉపయోగపడు గ్రంథ
ముల సమృద్ధియేగాక తగిన గ్రంథాలయోద్యోగీయు
లను, యీ వ్యాపనము సామర్థ్యముతో నడపువారును,
ఉత్సాహముతో పనిచేయువారును నగు సేవకులను
పోషించు సామర్థ్యముగల సంఘములుగా నుండవల
యును. గ్రంథాలయ సమస్యలు తెలిసినవారు, గ్రంథా
లయోద్యోగీయులు విద్యావంతులై నేర్పరులై యుం
డుట అత్యావశ్యకమని చెప్పుచున్నారు. ఈవరకు మన
అభిప్రాయము సామాన్యముగ నియుద్యోగీయులు గుమా
స్తాలు అయిన చాలునని కాని తెలిసినవారి ప్రస్తుతాభిప్రా
యము. వారు విద్యావంతులై, గ్రంథముల యుపయో
గములు తెలిసికొనినవారై, జ్ఞానోదయమునకు చేయు
యత్నములన్నియు కృషిచేసి గ్రంథాలయము లుప
యోగములోనికి తీసికొని రాతగినవారుగా నుండవలె
నని వారి సామర్థ్యము మీదనే గ్రంథాలయోద్యమము
యొక్క ఉపయోగము ఆధారపడి యున్నదనికూడ
చెప్పుచున్నారు. గనుక పట్టణ కేంద్రస్థానములు ఇన్ని
విధములుగా ఉపయోగపడునట్లుగా నుండవలయును.

పట్టణములలోను, పల్లెటి గ్రామములలోను జరుగు
నివివిధ ప్రయత్నములు క్రమముగా జరుగుటకుగాను,
ఒకదానికి మరొకటి ఆధారపడి కలసికట్టుగా యీ
యుద్యమము నెరవేర్చుటకుచేయు ప్రయత్నములు రాష్ట్రీయ
గ్రంథాలయభాగీయ సంఘములు నిత్యము కనిపెట్టి పని
చేయవలసియున్నది. ఈ సంఘములు ప్రజలస్థానేయుండి
జరిగిన పనులు తెలిసికొని జరుగబోవు పనులు ఆలో
చించి, కార్యక్రమము చక్కగా నెరవేరు నుపాయము
సదా కనిపెట్టుటకును, ఈ యుద్యమము పూర్తిగా నెర
వేరుటకు, నెరవేరు నుపాయములు ఆలోచించుటకు
సలుచేసి సహాయపడుట అత్యావశ్యకము. ఈ రజతో
త్సవము తమయందరి సానుభూతి బడసి జయప్రదముగా
జరుగగలందులకు కోరుచు సభాకార్యక్రమము ప్రారం
భింపగలందులకు సభవారిని ప్రార్థించుచు విరమించు
చున్నాను.

సభ్యులుగా చేరవలయుననియు ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

6. 1933-34 సంవత్సరమునకు మదరాసు ప్రభుత్వమువారు ప్రత్యేకించిన గ్రంథాలయ విరాళమునకై గావించిన దరఖాస్తులు మదరాసు విద్యాశాఖా డైరక్టరువారికి చేరవలసిన తేదీని ఆగస్టు 15 వ తేదీనుండి అక్టోబరు నెలాఖరువరకు మార్చగలందులకు మదరాసు ప్రభుత్వమువారిని ఈ సభవారు కోరుచున్నారు.

7. గ్రంథభాండాగారికులకు కావలసిన తరబీతు విషయమై ఉపసంఘమువారు తయారుచేసిన నివేదికను ఈ సభవారు ఆమోదించుచు దానిని అమలులో పెట్టుటకున్ను అందుకు కావలసిన యావత్తు పనులను చేయుటకున్ను ఈ క్రిందివారిని ఉపసంఘముగా ఏర్పాటు చేయుట మైనది.

(1) కే. జనార్దనం నాయుడుగారు, బి. ఏ. ఎల్. టి., డి. ఇ. మదరాసు కన్నెమరా గ్రంథాలయ గ్రంథభాండాగారి.

(2) కే. శామ్యులమ్మగారు, మదరాసు క్వీను మేరకాలేజీ గ్రంథభాండాగారిణి.

(3) కే. రామారావుగారు, బి. ఏ. ఎల్. టి. బెజవాడ, హిందూ హైస్కూలు హెడ్మాస్టరు.

(4) పి. రాజశేఖరంగారు, బి. ఏ; బి. యస్. సి.

(5) అయ్యంకి వేంకట రమణయ్యగారు.

8. మదరాసు గ్రంథాలయ చట్టమును గూర్చి ఉపసంఘమువారు తయారుచేసిన నివేదకను ఆమోదించడమైనది. దానిని ప్రచురించుటకు తీర్మానించడమైనది.

ప్రస్తుతము దేశము నాకరించిన అధిక దుర్భరస్థితియందు క్రొత్తపన్నులు వేయుట భావ్యము కాకపోవుటచేతను, క్రొత్త సంస్కరణములందు గ్రంథాలయముల ఉపయోగమునుగూర్చి యెక్కువ సదుపాయములు గలుగుటకు సావకాశ ముండుటచేతను, స్వభావమునందును, ఉద్దేశమునందును, నిర్మాణమునందును మిక్కిలి లోపభూయిష్టముగా నున్నట్టియీ మదరాసు గ్రంథాలయ చట్టమును విరమించుకోవలెనని ఈసభవారు తీర్మానించుచున్నారు.

9. [illegible] సంవత్సరములనుండి గ్రంథాలయోద్యమవ్యాప్తికై జయప్రదముగ పనిచేయుచున్న అఖిలభారత సర్వగ్రంథాలయ సంఘమున్న సమయమున, వేరుగ ప్రత్యేక సభగాను పోటీసంఘముగాను ఏర్పరచి, గ్రంథాలయోద్యమమునందు చీలికలను కల్పించు ప్రయత్నములు అనుచితములని ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు.

10. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు శాఖలుగా చేరిన గ్రంథాలయములను 'రిజస్టరు చేయబడిన గ్రంథాలయములు' గ ఎంచగలందులకు ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

11. ఆంధ్రదేశమందు ప్రభుత్వమువారిచ్చు గ్రంథాలయములకును జరుగు ఈనాటి ప్రత్యుత్తరములను, ఆంధ్రదేశగ్రంథాలయముల అభివృద్ధికై పాటుబడుచున్న ఆంధ్రదేశగ్రంథాలయ సంఘముద్వారా జరుగగలందులకు ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

12. (క) ఆంధ్ర విజ్ఞాన, ఆర్థిక, సాంఘికోన్నతికి ఆంధ్రదేశము నంతటిని ప్రత్యేకించుట ఆత్యావశ్యకము గాన ఆంధ్రరాష్ట్రమును వెంటనే యేర్పరచవలయుననియు, యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

(ఖ) బరంపురము పట్టణమును ఒరిస్సాలో చేర్చుట ఆంధ్రుల అభివృద్ధికిని, ఐకమత్యమునకును ప్రబలతరాటంకముగా నుండును గావున అట్టుల చేర్పరాదని ప్రభుత్వమువారిని ఈసభవారు కోరుచున్నారు.

13. "ఆంధ్రదేశమందున్న గ్రంథాలయ ఉద్యమమునుగూర్చి అనంతమైన వెలిసికొనుటంటె ఆంధ్రదేశమందు వందలకొలదిగల గ్రంథాలయములు పెక్కువత్సరములనుండి జగద్విఖ్యాతముగ పనిచేయుచుండుటను గమనింపజాలక, ఆంధ్రదేశ గ్రంథాలయ ఉద్యమముయొక్కయు, ఆంధ్రదేశ గ్రంథాలయములయొక్కయు ప్రతిష్ఠకు భంగకరముగ నట్టుల మదరాసు "గ్రంథాలయ సంఘము" వారు నూతనముగా ప్రచురించిన "గ్రంథాలయ శాస్త్రముయొక్క అయిదు సూత్రములు (The five laws of Library)" అను గ్రంథమునందు ఆంధ్రదేశమందలి గ్రంథాలయ ఉద్యమమును గూర్చి వ్రాయుచు,

"ఆంధ్రదేశమందు గడచిన పది సంవత్సరముల అఖరున గ్రంథాలయములను సుభిక్షమైన పంట పండినది. కాని కొంతవరకు రాజకీయ ఉద్యమమందు కలిసిపోయి దానియొక్క విపర్యయమువలన అణగిపోయి క్రమ

ముగా నశించుచున్న కొన్ని శేషములను మాత్రము మనము చూచుచున్నాము (We see a few decaying remnants of a bumper crop of libraries that shot forth at the close of the last decade in the land of the Andhras but soon got strangled, partly as a result of the vicissitudes of the political movement with which they got intertwined)"

అని అప్రస్తుతముగా వ్రాసినందులకు ఈ సభవారు మిక్కిలి గర్హించుచు, అన్యాయముగ వ్రాసిన సదరు వ్రాతను తమ గ్రంథమునుండి తీసివేయవలసినదని సదరు మద్రాసు గ్రంథాలయ సంఘము వారిని ఈ సభవారు కోరుచున్నారు.

14. విలేజి డెవలెప్మెంటు ఫండులోనుంచి గ్రంథాలయములకు ప్రతిసంవత్సరము కొంతభాగము విరాళములుగా ఇవ్వవలసినదిగా ఆయా జిల్లాబోర్డుల కమిటీలవారిని ఈ సభవారు కోరుచున్నారు.

15. జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు, పంచాయతీబోర్డులు, సహకారసంఘములు, గ్రంథాలయములను స్థాపించవలసినదనియు, ఇదివరకున్న గ్రంథాలయములకు విరివిగా సహాయము చేయవలసినదనియు ఈ సభవారు కోరుచున్నారు.

అంతటితో ప్రథమదిన సమావేశము ముగింపునకు దేబడెను.

## రెండవదిన సమావేశము.

పదకొండవ తేదీ ఉదయము 8-30 గంటలకు ఈ సభ సమావేశమైనపుడు అంగలూరు మేరీగ్రంథాలయ కార్యదర్శియగు శ్రీమతి అట్లూరి శీతమ్మగారు "గ్రంథాలయోద్యమమున తమకుగల యనుభవములనుగూర్చి ఉపన్యసించిరి. అనంతరము స్త్రీల గ్రంథాలయముల"నుగూర్చి శ్రీమతి బొడ్డపాటి శీతాబాయమ్మగారును, గ్రంథాలయ పరిపాలనయందు గ్రంథాలయ శాస్త్రము యొక్క ఉపయోగమునుగూర్చి ఘంట్యమాల రాజశేఖరంగారును మాట్లాడిరి.

అధ్యక్షులకును, ప్రతినిధులకును వందన సమర్పణముతో సభ ముగింపబడెను.

# ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ రజతోత్సవము, బెజవాడ.

## ఆగష్టు 11—12 తేదీలు, 1933 సం.

పదకొండవతేదీ మధ్యాహ్నము 3—0 గంటలకు ఈ సభ రామమోహన గ్రంథాలయమందు సమావేశమయ్యెను. గ్రంథాలయోద్యమమందు ముప్పది సంవత్సరములనుండి పనిజేయుచున్న గ్రంథాలయోద్యమ సేవకులచే సభాభవనమంతయు క్రిక్కిరిసియుండెను.

మొదట ఈ సభ ఆహ్వానసంఘాధ్యక్షులగు తుమ్మలపల్లి జగన్నాథంగారి పక్షమున పాణుకుపాటి వేంకటనాగభూషణంగారు వారి స్వాగతోపన్యాసమును ముగించిన తరువాత సభను ప్రారంభించుచు చల్లపల్లిరాజాగారు ఉపన్యసించిరి. జరిమిలా అధ్యక్షులగు చట్టి నరసింహారావుగారు తమ అధ్యక్షోపన్యాసమును గావించిరి. సభకు ఆంధ్రదేశములో వివిధ ప్రాంతములనుండి అనేక ప్రతినిధులు వచ్చిరి. సభకు రాజాలక పోయినందులకు చింతిల్లుచు వారి అభినందనములు ఈ క్రింది వారు పంపిరి.

## అభినందన లేఖలు

న్యూటను మోహనుదత్తుగారు, బరోడా గ్రంథాలయాధికారి:—

"రాజాలనందులకు చింతిలుచున్నాను. సభ జయప్రదముగ జరుగుగాక."

దివాన్ చంద్ శర్మగారు, ఎం. ఏ., లాహోరు డి. ఏ. వి. కాలేజీలో ప్రొఫెసరు:—

"మీరుపంపిన ఆహ్వాన మందినది. ఇదివరకే ఇంకొక చోటికి వెళ్లుటకు ఏర్పాటు చేసికొని యుండుటచేత మీ పండుగ ఉత్సవముల వచ్చి ఆనందమును అనుభవింప జాలకున్నాను. వెయ్యి గ్రంథాలయములను స్థాపన జేసి, జనసామాన్యమునందు విద్యావ్యాపన జేయుటకై మీరు చేసిన గొప్ప పనులను హృదయపూర్వకముగ ఆశీనందించు చున్నాను. ముఖ్యముగా ఐచ్ఛికముగా ఈ పనియంతయు జరిగియుండుటంజేసి. ఈ ఘనకార్యమునకు భారతీయులందరును గర్వపడ వలయును. భారతావనియందు ఇతర రాష్ట్రములవారు మీయొక్క ఘనమైన దృష్టాంతమును అనుకరింపదగి యున్నారు. బీదనిబోవు ప్రతి వానికిని జ్ఞానమును అందుబాటులో నుండునటుల జేయుటకై మీరుచేయు త్యాగపు పనులయందు దిగ్విజయము కలుగుగాక."

మద్రాసు గ్రంథాలయ సంఘమువారు:—"ఆంధ్రదేశ ధర్మగ్రంథాలయోద్యమముయొక్క రజతోత్సవమును గూర్చి తెలిసికొనుటకు మద్రాసు గ్రంథాలయ సంఘమువారు సంతోషించుచున్నారు. ఆంధ్రగ్రంథాలయ సభవారికి తమ సోదర వాత్సల్య పూర్వకమగు అభివందనము లర్పించుచున్నాము. సభయును ఉత్సవమును జయప్రదముగ జరుగుగాక."

మాడపాటి హనుమంతరావుగారు, నిజాం రాష్ట్రాంధ్ర జనకేంద్ర సంఘము, హైదరాబాదు:—

"మీ సభ జయప్రదముగ జరుగుగాక."

హెచ్చి సుబ్బారావుగారు, బి. ఏ; బి. ఎల్; మైసూరు పబ్లికు గ్రంథాలయ కార్యదర్శి:

"మా అభివందనములను పంపుచున్నారము"

ఐ. శీతారామారావుగారు. కార్యదర్శి శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయము, హైదరాబాదు:—

"సభ జయప్రదముగ జరుగుగాక."

ఏ. ఆర్. వాడియాగారు బి. ఏ; బారిష్టరు, మైసూరు విశ్వవిద్యాలయమందు ప్రొఫెసరు:—

"కడచిన ఇరువదియైదు సంవత్సరములందు మీరు చేసిన అద్భుతమగు పనికి నా హృదయపూర్వకమగు అభివందనముల నర్పించుచున్నాను. మీ కార్యము కలకాలము నిలచి సువర్ణోత్సవము జరుపుగాక.

మరియు భారతావనికంతకును మార్గదర్శకమగుగాక."

కె. బి. మాధవగారు, యం. ఏ. ఏ. ఐ. ఏ. మైసూరు విశ్వవిద్యాలయమందు ప్రొఫెసరుగారు:—

"ఈ కాలమునకు కావలసినవి విజ్ఞానము, వికాసము' నిర్మలమగు పర్యాలోచనము గ్రంథాలయోద్యమము. ఈ మూడింటిని సహాయభూతముగ జేసుకొని యథార్థమగు జ్ఞానమును, సత్సంకల్పమును న్యాయబుద్ధిని వెంపొందింప జేయును. మనయొక్క రాజకీయ ఆర్థిక సాంఘిక విమోచనము లేకాక ఆత్మవిమోచనము గూడ జ్ఞానాభివృద్ధిపై ఆధారపడియున్నది. దీనికొరకు మన ప్రాచీన సంస్థలైన పురాణశ్రవణము, హరికథా కాలక్షేపము, జంగముకథలు, ఇత్యాదిసాధనములు జాతియవ్యక్తిత్వమును ఇనుమడించుచున్నవి. మీ సభ జయప్రదమగుగాక"

జి. యస్. మిత్రగారు. కాశీవిశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారి.—

"ఇంత మంచిపని ఆంధ్రదేశమున జరుగుచున్నదని తెలిసికొనుటకు మిక్కిలి సంతోషముగ నున్నది. సభ జయప్రదమగుగాక."

కె. యల్. నరసింహారావుగారు, అడ్వొకేటు, మద్రాసు.

"ఏజాతియొక్కగాని విజ్ఞానాభివృద్ధికి ధర్మగ్రంథాలయోద్యమము అత్యంతావశ్యకమై యున్నది. జనులయొక్క విజ్ఞానాభివృద్ధికి దోడ్పడినగాని, ఒకజాతి గొప్పదగుటకుగాని, ఐశ్వర్యవంత మగుటకుగాని ఆశింపజాలదు. విజ్ఞానము భాగ్యవంతులయొక్కయు చదువుకొన్నవారి యొక్కయు సొత్తుమాత్రమే గాదు. అతి బీదవాడును, చదువుకొన లేనివాడును గూడ దానిని పొంద నర్హుడు. ఏదేశమందైన, వయోజనవిద్యావ్యాపకేముమూలమున అతి బీదవానియొక్కయు, చదువురానివానియొక్కయు విజ్ఞానాభివృద్ధికై విశేషముగా పాటు

పడుచున్నది ఘన్యమగు గ్రంథాలయోద్యమమే; గావున అందరును ఈ యుద్యమమునకు తోడ్పడవలయును.

కే. యం. అసదుల్లాగారు, కలకత్తా ఇంపీరియల్ లైబ్రరీ గ్రంథ భాండాగారి:—

"సభ జయప్రద మగుగాక".

యస్. సి. కేల్కారుగారు, యం. ఏ. ఎల్. ఎల్. బి. పూనా:—

"మీ రాజధానియందు గ్రంథాలయోద్యమ వ్యాపనకై మీరు చేయు ఘనకార్యముతో నా హృదయ మెప్పుడును కలసియుండును. విద్యను జ్ఞానమును వ్యాపనము జేయుటకై గ్రంథాలయములే సాధనములని నా నమ్మిక. అవి అమితముగా వృద్ధిని బొందవలెను. మీపనియందు ఎల్లప్పుడు జయము కలుగుగాక. గ్రంథాలయ మహోత్సవమునకై మీరు నిర్ణయించిన ప్రణాళిక జయప్రదముగ కొనసాగుగాక. మీపనిని మిక్కిలి అభిలాషతో వినుటకు కుతూహల పడుచుందును. మీరు అప్పుడప్పుడు పంపు నివేదికలను ఆతురతతో అందుకొనుచుందును."

కే. యస్. కే. స్వామిగారు, బి.ఏ , ఎల్. ఎల్.బి: ఏ. యల్. ఏ. బొంబాయి గవర్నమెంటు సెక్రటరీ యేటు లైబ్రరీ గ్రంథ భాండాగారి:—

"మీసభకు అన్నివిధముల జయము కలుగుగాక". "మీసభాఫలితముగ ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము అనేకవిధముల విజృంభించుగాక".

కే. కోటిరెడ్డిగారు, బార్-ఎట్-లా; యం.ఎల్.సి. కడప:—

"సభ జయప్రదముగా జరుగుగాక; జాతియొక్క పునర్నిర్మాణమునకై ఈయుద్యమము దేశమునందెల్లెడల వ్యాప్తిని జెందవలెను".

యస్. సత్యమూర్తిగారు, అడ్వకేటు. మదరాసు:—

"మీ సభయును, గ్రంథాలయోద్యమమును జయప్రదముగ కొనసాగుగాక యని కోరుచున్నాను.

అంతటితో మొదటిదినము సభ ముగింపబడినది.

## రెండవదినము.

రెండవదినము ఉదయము 8—30 గంటలకు తిరిగి సభ సమావేశమయ్యెను.

సభకు విచ్చేసిన గ్రంథాలయ సేవకులు ఒక్కరొక్కరే లేచి తమ యనుభవములను, కష్టనిష్ఠురములను గూర్చి విపులముగా ముచ్చటించిరి. అట్లు తమ యనుభవములనుగూర్చి చెప్పినవారిలో గొందరు;

వానిలాల గోపాలకృష్ణయ్యగారు, భూపతిరాజు తిరుపతిరాజుగారు, అయ్యంకి వేంకటరమణయ్యగారు, యాతగిరి లక్ష్మీవెంకటరమణగారు, కలిదిండి నరసింహరాజుగారు, గ్రుగుబండి సుబ్బారావుగారు, ఆట్లూరి సీతమ్మగారు, రుద్రరాజు నరసింహరాజుగారు, అవుటపల్లి నారాయణరావుగారు, పుణ్యమూర్తుల రాజశేఖరంగారు, చట్టి నరసింహారావుగార్లు అంతటితో ప్రాతఃకాల సమావేశము ముగిసినది.

## మధ్యాహ్నసమావేశము.

తిరిగి మధ్యాహ్నము 3 గంటలకు సభ సమావేశమయ్యెను. అప్పుడు ఎక్కువ కాలమునుండి గ్రంథాలయోద్యమమందు కృషి చేయుచున్న గ్రంథాలయోద్యమ నాయకులకును గ్రంథాలయముప్రతినిధులకును ప్రాచీన సాంప్రదాయానుసారము గౌరవపురస్సరముగ బహుమతు లర్పింపబడెను.

## బహుమతులు.

మొదట బహూకరింపబడినవారు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ పితామహులగు (1) శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారు: వీరికి మొదట చందనముచేతను అత్తరు పన్నీరుచేతను అలంకరించిన పిమ్మట తాంబూలము నిచ్చి, అధ్యక్షులవారు వారిని శాలువచే గప్పిరి. ఇదేరీతిని.

(2) చట్టి నరసింహారావుగారు (3) గోపరాజు బ్రహ్మానందంగారు (4) కొత్తపల్లి వెంకట రాజుగారు (5) ఆట్లూరి సీతమ్మగారు, (6) మేకా గంగయ్యగారు (7) కొప్పరపు వెంకట రమణయ్యగారు; (8) గొర్రెపాటి వేంకటసుబ్బయ్యగారు (9) సూరి కృష్ణమూర్తిగారు (10) కేతగిరి లక్ష్మీవేంకట రమణయ్యగార్లకు ఒసగబడెను, అయ్యంకి వేంకటరమణయ్యగారికి ఖద్దరుశాలువయేగాక ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ పక్షమున గ్రంథాలయోద్యమమున కధిష్ఠాన

దేవతయగు, దంతముతో చెక్కబడిన ఒక సరస్వతీ దేవి విగ్రహముకూడ బహూకరించిరి. కీ॥ శే॥ సూరి వేంకటనరసింహశాస్త్రిగారి గౌరవముగా వారికుమారుడు కృష్ణమూర్తిగారి కొసంగిరి. ఆఖరున ఇతర సభికులనందరిని చందన తాంబూలాదులతో సత్కరించి సభ ముగింపుజేసిరి.

## తుమ్మలపల్లి జగన్నాథంగారి ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము

ఆంధ్రగ్రంథాలయోద్యమ రజతోత్సవమునకు మిమ్ము మా రామమోహన ధర్మగ్రంథాలయ పక్షమున ఆహ్వానించుభాగ్యము నాకు గలిగినందులకు మిక్కిలి సంతసించుచున్నాడను. ఈ యుద్యమము ప్రథమమున నేదో యొకప్రాంతమున బయలుదేరినప్పటికిని, ప్రస్తుతము ఈ యుద్యమము ఆంధ్రజిల్లాలలో ప్రముఖ్యముగా నున్నవని చెప్పవచ్చును. గ్రంథాలయోద్యమము వలన పల్లెటూరియందును ప్రజలకు విద్యాసక్తి కలుగుచున్నదనుట అతిశయోక్తి కాదు.

ఆంధ్రభాషకు 1826 సంవత్సరమున అచ్చు అక్షరములు తయారు చేయబడెను. అటుపైని 1834 సంవత్సరమునందు ఆంధ్రగ్రంథములు ముద్రింపబడుటకు ప్రారంభమయ్యెను. ఆంధ్రదేశమునం గల గ్రంథాలయములలో మొట్టమొదటి గ్రంథాలయము 1886 సంవత్సరమున విశాఖపట్టణములో స్థాపింపబడి "సరస్వతీనిలయ"మై వెలసినది. పిమ్మట కృష్ణాజిల్లా పులివెందుల యను గ్రామమున "సరస్వతీ గ్రంథాలయము" వెలసినది. తరువాత గుంటూరుజిల్లా పొంగవోలునందు "సి. పి. యస్. లైబ్రరీ" బయలుదేరినది. 1894 సంవత్సరమున విజయనగరములో "సింహాచలపురావు లైబ్రరీ"యున్ను, 1895 సంవత్సరమున భీమవరం తాలూకా ఉండిగ్రామమున "సారోజినీక్లబ్బు"న్ను 1897 సంవత్సరమున కుముదవల్లి గ్రామమున వీరేశలింగ కవి సమాజమున్ను 1898 సం॥రములో గుంటూరుజిల్లా కొల్లూరు గ్రామములో శ్రీవెంకటేశ్వర నిలయమున్ను 1900 సం॥రమున గుంటూరు పురమున ఎంగ్ మెన్సు లిటరరీ అసోసియేషనున్ను రాజమహేంద్రవరమున వీరేశలింగ పుస్తక భాండాగారమున్ను; 1904 సం॥రములో డక్కన్ హైద్రాబాదు నగరమున కృష్ణదేవరాయాంధ్రభాషానిలయమున్ను స్థాపింపబడినవి. 1911 సం॥రములో మా బెజవాడ నగరమున శ్రీరామమోహన ధర్మపుస్తక భాండాగారము స్థాపింపబడినది. పిమ్మట యావదాంధ్రదేశమున సార్వజనిక గ్రంథాలయములు పొడసూపినవి.

ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ బెజవాడ నగరమునందు 1914 సం॥రములో జరుపబడెను. నిరంతర గ్రంథాలయోద్యమ సేవకులును నిష్కల్మషనిరాడంబర జీవులును, సుప్రసిద్ధన్యాయవాదులును అగు కీ॥ శే॥ సూరి వేంకటనరసింహశాస్త్రిగారు ఈమహాసభాహ్వాన సంఘమునకు అధ్యక్షులు. వీరి నాయకత్వమున ప్రథమ గ్రంథాలయ మహాసభ విజయవంతముగ జరిగెను. శ్రీశాస్త్రిగారు తమ జీవితమునంతను గ్రంథాలయోద్యమాభివృద్ధి నిమిత్తము వినియోగించిరి. పురుషోత్తమ ధార్వాడు, మున్నగు నగరములలో జరిగిన గ్రంథాలయ మహాసభలకు అధ్యక్షత వహించిరి. ఆంధ్రదేశమునందేగాక అఖిలభారతావనియందును గ్రంథాలయోద్యమమును గూర్చి ప్రబోధము గావించిరి. శాస్త్రిగారు మా రామమోహన గ్రంథాలయమునకు చేసిన సేవ అపారము. వారికి సహాయులుగనుండి వారితోపాటు సేవజేసిన వారిలో శ్రీయుతులు అయ్యంకి వేంకటరమణయ్య, గోపరాజు బ్రహ్మానందము, వేలమూరి గోపాలకృష్ణయ్యగార్లు ప్రశంసనీయులు.

ప్రథమములో గ్రంథాలయములు అచ్చటచ్చట స్థాపింపబడినప్పటికిని 1911 సం॥రమునుండి ఆంధ్రదేశమునందు గ్రంథాలయోద్యమము మహావృక్షమై ఆంధ్రదేశమంతటను వేళ్ళ బారుకొని యూడలను సారింప జేయుటకు మార్గము న్వేషించిన శ్రీసూరి వేంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వేంకటరమణయ్య, నాళం కృష్ణారావు, ... బలరామయ్య, పాటూరుస్వామిబాబు, మారేపల్లి రామచంద్రరావు, ప్రఖ్యాత లక్ష్మీనరసింహం, మాగంటి బాపినీడు, నడింపల్లి వేంకటలక్ష్మీనరసింహారావు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, భోగరాజు పట్టాభిరామిరెడ్డి, సి. వి. రంగంశెట్టి, అడవి శంకరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు; ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం, వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి, ఆరకపూడి రామస్వామి; అయ్యదేవర కాళేశ్వరరావు, మాడపాటి హనుమంతరావు, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, పింగళి వెంకట్రామరెడ్డి, శ్రీరాజా నాయని వెంకటరంగారావు బహద్దరు; శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగార్లు చిరస్మరణీయులు.

ఆంధ్రదేశములో 1914 సంవత్సరాంతము వరకు 169 గ్రంథాలయములు నెలకొల్పబడి, నిర్విఘ్నముగ సేవచేయుచుండినవి. ప్రథమమున నొక యుద్యమము సరియైన మార్గమున నడిచినచో ఆయ్యది తానంతట అది యే వృక్షముకవలె పెరిగి, దినదినాభివృద్ధిగాంచును. 1915 సంవత్సరమునుండి 1938 సం||రం వరకు షుమారు 1000 గ్రంథాలయములు స్థాపింపబడి ప్రజాసేవ, భాషాసేవ జేయుచున్నవి. 1914 సం||రములో బెజవాడలో జరిగిన ప్రథమాంధ్రదేశ గ్రంథాలయ మహాసభయందు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము స్థాపింపబడెను. ఆంధ్రదేశములోని వివిధ గ్రంథాలయములయందు సోదరభావమును కలుగజేయుటకును, పరస్పర సహాకారమును కలుగజేయుటకును; గ్రంథాలయములు నెలకొల్పుటకును, ఈ సంఘము ఉద్దేశింపబడియెను. నాటనుండి నేటివరకు యీ సంఘము ఆంధ్రలోకమునకు జేసిన సేవ శ్లాఘనీయము. ఆంధ్ర గ్రంథాలయోద్యమము యీ రీతిని వృద్ధిగాంచుచున్నను, తమిళసోదరులు మన ఉద్యమ ప్రాముఖ్యమును గ్రహించలేని వారైరి. 1914 సంవత్సరం మొదలు 1938 సంవత్సరం వరకు ఆంధ్రగ్రంథాలయ మహాసభలు జరిగినను వాని కార్యక్రమ విధానములు పత్రికలలో ప్రచురింప బడినను, మన అరవసోదరులు వీనిని గమనించరైరి. ఏలయన ఆయిదు సంవత్సరముల క్రిందట స్థాపింపబడి, యింకను వృద్ధినైనను పొందని చెన్నపురి గ్రంథాలయ కార్యదర్శిగారు గ్రంథాలయశాస్త్రమునకు ఆయిదు నిబంధనలు (Five Laws of Library Science) అను గ్రంథమును వ్రాయుచు మన గ్రంథాలయోద్యమము అడుగంటుచున్నటుల వ్రాసినారు. వారు దానికి పట్టికలు చూపుచుండినను, ఆంధ్ర గ్రంథాలయోద్యమ నాయకులతో సంభాషించి యుండినను, అట్టి అప్రస్తుత వ్రాతలు వ్రాసియుండరు. 19 సంవత్సరములలో 800 గ్రంథాలయములు స్థాపించుట ఉద్యమము బలహీనత తెల్పునా! లేక అభివృద్ధిని తెల్పునా? ఇంతియగాక మన గ్రంథాలయములు కుక్కగొడుగుల వలె బయలుదేరి రాజకీయ సంచలనలో దగుల్కొని నశించుచున్నవని వ్రాసియున్నారు. ఇట్టి అవినీతికరములగు వ్రాతలు వ్రాయుటకు తమిళసోదరునికి రెండుకారణములు కనుబడి యుండవచ్చును. మొదటిది తమిళదేశీయులకంటె చాల సంవత్సరములకు ముందుగా ఆంధ్రులు గ్రంథాలయములను స్థాపించి ప్రజలకు ఉపయోగపడునటుల జేసిరి. 1885 సంవత్సరము నుండి యింతవరకు తీవ్రకృషి సలిపి ఆంధ్రదేశమున గ్రంథాలయములను నెలకొల్పుటయేగాక అఖిలభారత గ్రంథాలయ సంఘమునకు అధికారులుగ నెన్నుకొనబడి భారతవర్షమంతయు ఉద్యమ ప్రచారమును కొనసాగించిరి. ఇక రెండవకారణ మేమన తమిళులకంటె ముందుగ ఆంధ్రులు ఈ యుద్యమములో పాల్గొనుటయు, అభివృద్ధిగాంచుటయు వారికి గిట్టనటులున్నది. ఆంధ్రోద్యమమును విమర్శింపబూనినగాని తమ ప్ర[illegible] నిలబడికొనని తలంచిరి. అటిసంగతులను తూలనాడినగాని వారి సంగతులకు బలము చేకూరదని విచారించిరి. ఆంధ్ర గ్రంథాలయోద్యమము క్షీణించిపోవుచున్నదని వాదించినగాని ప్రభుత్వమువారు ప్రత్యేకించిన ధనము తమ హస్తగతము గాదని యూహించినట్లున్నది. ఆంధ్ర గ్రంథాలయములు రాజకీయ సంచలనములో పాల్గొనినవని సూచించినగాని ప్రభుత్వమువారికి ఆంధ్రగ్రంథాలయములందు ఆగ్రహము రాదు. ఆ ఫలము ప్రభుత్వ ధనము తమిళుల బొక్కసములో ఇమిడిపోవునను ఆశతో చెన్నపురి గ్రంథాలయ కార్యదర్శిగారు ఆంధ్ర గ్రంథాలయోద్యమమును గూర్చి చేయుచున్న [illegible] విమర్శనలవలన మన గ్రంథాలయోద్యమమునకు ముప్పు వాటిల్లుచున్నది. వారి విమర్శనలు నిరాధారములు. వారి యూహాప్రపంచమునకు ఆంధ్రులు తగిన చికిత్స నాలోచించి కర్తవ్యమును నిర్ణయింప, తరుణ మాసన్నమైనది.

గ్రంథాలయములు ప్రజలకు విజ్ఞానమందిరములు. మన గ్రంథాలయపోషణకు ద్రవ్య సహాయము అవసరము. ప్రజలు తమ శక్తికొలది గ్రంథాలయములకు ధనము సమకూర్పవలెను. విదేశములలో అయా ప్రభుత్వములు గ్రంథాలయములను స్థాపించి వానికి ద్రవ్యసహాయము చేయుచున్నవి. మన దేశములో బరోడా సంస్థానము వారు తమ రాష్ట్రములో విరివిగా గ్రంథాలయములను స్థాపించి పోషించుచున్నారు. మన చెన్నరాజధానిలోని గ్రంథాలయములకు ప్రభుత్వమువారు సంవత్సరమునకు రూ|| 20,000లు మాత్రము ఖర్చుచేయుచున్నారు. ఇయ్యది అతిస్వల్పమొత్తము. ఈమొత్తము రాజధానిలో ఒక ప్రాంతములోని గ్రంథాలయములకే చాలదు. అట్టిస్థితిలో ఆంధ్రగ్రంథాలయములకు చాల స్వల్ప మొత్తము చేకూరగలదు. ఈ విషయమై మనము తీవ్రముగ ఆందోళన చేయవలసియున్నది.

గ్రామ పునర్నిర్మాణమునకు గ్రంథాలయము ముఖ్యావసరము, గ్రామ గ్రంథాలయములలో వ్యవసాయకుల కుపయోగించు పొత్తములు పెక్కు లుండవలెను. బాలశాఖ, స్త్రీశాఖ నెలకొల్పబడవలెను. ఉపన్యాసములవల్ల, పత్రికా పఠనములవల్లను ప్రజలలో విజ్ఞానమును పెంపొందించుటకు ప్రయత్నములు జరుగవలెను. స్థానిక సంస్థలు గ్రంథాలయములకు ఆర్థికముగ సహాయమును చేయుటకు తగిన యవకాశముల గల్పించుటకు మదరాసు శాసనసభవారు స్థానిక సంస్థల చట్టమును మార్పుచేసి యున్నారు. జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు, పంచాయతీబోర్డులు మునిసిపాలిటీలు ప్రజోపయోగములగు గ్రంథాలయములకు ధనసహాయము చేయుట ముఖ్యావసరము. ప్రస్తుత కృష్ణాబోర్డు అధ్యక్షులు విద్యాధికులు, జమీందారులు. అట్టిప్రభువు మన ఆంధ్ర గ్రంథాలయోద్యమ రజతోత్సవ సభ ప్రారంభించుట యెంతయు ముదావహము. వారు మన గ్రంథాలయోద్యమమునెడ అభిమానులై స్వయముగను, జిల్లాబోర్డు తాలూకాబోర్డుల ద్వారాయును గ్రంథాలయోద్యమమునకు తగు సహాయము చేసి కృష్ణాజిల్లాను ఆదర్శప్రాయముగా చేయగలరని నమ్ముచున్నాను.

మా యాహ్వానము నంగీకరించి దయతో సభ కరుదెంచిన తమ కెల్లరకు మా సంఘపక్షమున కృతజ్ఞతలు వెల్లడించుచున్నాను. ఈ రజతోత్సవసభను శ్రీ చల్లపల్లి రాజాగారు ప్రారంభింపవలసినదిగ కోరుచు ఈ సభకు శ్రీ చిట్టి నరసింహారావుగారిని అధ్యక్షత వహింపవలసినదని కోరుచు ఆంధ్రకీర్తులను నలుదెసల వెదజల్లుదురుగాక యని దేవుని ప్రార్థించుచున్నాను.

## శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దరు జమీందారు, చల్లపల్లి యెస్టేటు (కృష్ణా జిల్లాబోర్డు ప్రెసిడెంటు) గారి ప్రారంభోపన్యాసము.

ఆంధ్రదేశ గ్రంథాలయ రజతోత్సవములో పాల్గొనుట నాకు చాలా ఆనందముగా నున్నది. ఆంధ్రదేశములో గ్రంథాలయోద్యమము 1886సం॥ పుట్టియున్నది. ఆ సంవత్సరమున విశాఖపట్టణములో ఒక బీద ఉపాధ్యాయునిచే మాలదొడ్ల ఒక గ్రంథాలయము స్థాపింపబడినది. మన దేశ గ్రంథాలయముల తరఫునను గ్రంథాలయోద్యమము తరఫునను ఆ మహామహుని దివ్యస్మృతికి నా గౌరవప్రపత్తులతో నమస్కరించుచున్నాను. గ్రంథాలయోద్యమము ప్రారంభింపబడెనన్న ఆ మహామహుని దివ్యస్మృతిగ శిలాప్రతిమ యొకటి స్మారకచిహ్నముగా చేసినచో యువకులయందు యీ యుద్యమముపట్ల యెక్కుడు ఉత్సాహముతో పనిచేయుటకు అవకాశము కలిగించినవారమగుదుము. తదనంతరము కడప జిల్లాలోని పులివెందల రాజమహేంద్రవరము మొదలుగాగల అనేకస్థలములలో గ్రంథాలయములు వెలిసినవి. ఈవిధముగా అచ్చటచ్చట పుట్టి అభివృద్ధినొందిన ఈ గ్రంథాలయములు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము యొక్కయు రామమోహన గ్రంథాలయం యొక్కయు కృషితో ఏకసూత్రము క్రింద పనిచేయుటకు ప్రారంభించినవి. ఈ యుద్యమ ప్రారంభకులు గడుంగడు స్మరణీయులు శ్రీయుతులు అయ్యంకి వేంకటరమణయ్య, నాళం కృష్ణారావు, గోపరాజు బ్రహ్మానందం, నూరి వేంకటనరసింహశాస్త్రి, తిప్తి బలరామయ్య, వేలమూరి గోపాలకృష్ణయ్య, రాయప్రోలు సుబ్బారావు, చిట్టి నరసింహారావుగార్లు, తదితర మహామహులు వందనీయులు. వీరు యెట్లున్నను నేడీ రజతోత్సవమును చేయుట యీ యుద్యమమూలాధార బలసంపదను వేనోళ్ల చాటుచున్నది. విజ్ఞానవ్యాప్తి ప్రచారకులు లేమిచే యున్నడు ఆగజాలరు. ఈ యుద్యమమును యీ యుద్యమ సేవకులను నేడీవిధముగ గౌరవించుటయే ఉద్యమశక్తికిని ఉత్సాహములకును ప్రబలసాక్షి. కొలదికాలము క్రిందట ఈ యుద్యమమును ఆదర్శములను తెలియనివారలు హేళనగావించిరి. కాని నేడు యీ యుద్యమమునకు అట్టి ఆటంకములు యేమియును లేవు. అజ్ఞానతిమిరాంధకారమును చెల్లాచెదరొనరించుటకు నేడు గ్రంథాలయోద్యమము విజ్ఞాన నిరూత్న పవిత్రతేజస్సుతో కృషి చేయుచున్నది. గంజాము నుండి నెల్లూరువరకును హైదరాబాదునుండి బళ్లారివరకును ఆంధ్రదేశమంతటను గ్రంథాలయములు వెలసినవి. ఇదియే యీ యుద్యమవ్యాప్తికి ప్రబల నిదర్శనము. ఈ యుద్యమము పూర్వమొనరించిన కృషిగాని చేయదలచిన పనిగాని చెప్పుట అనవసరము కాని వటవృక్షమువలె జ్ఞానము వెలుగుకొరకు వెదకువారలకు నీడయయి తనరారుచున్నది. ఈ యుద్యమమునకు పొలిమేరలు లేవు. నేడీ రజతోత్సవమున పాల్గొనుటకు వచ్చిన ప్రతిసభ్యుడును తమ గృహములకు ద్విగుణీకృత శక్తియుత్సాహములతో వెడల

ఉద్యమవ్యాప్తికి సహాయమొనరింతురుగాక. ఈ రజతోత్సవ సభను ప్రారంభించు మహదవకాశము నాకొసంగినందులకు నేను చాల గర్వించుచూ మనఃపూర్వక ఆనందముతో సభను ప్రారంభించుచున్నాను.

## అధ్యక్షులు :

### చల్లా నరసింహారావు పంతులుగారి యుపన్యాసము.

గ్రంథాలయ సోదర ప్రతినిధులారా! నేను గ్రంథాలయోద్యమమునకు చేసిన సేవ స్వల్పమైనను నన్నీ సభకు అధ్యక్షునిగా యెన్నుకొన్నందులకు మీకు కృతజ్ఞతాపూర్వక వందనము లాచరించుచున్నాను. దేశసేవాతత్పరులు పెక్కండ్రు ఈ సభ నలంకరించియున్నారు. వారికి నా క్షమాపూర్వకవందనముల నాచరించుచున్నాను. ఈ రజతోత్సవ మహాసభను జయప్రదముగ కొనసాగించుటకు మీరెల్లరు నాకు తోడ్పడ ప్రార్థితులు.

భారతదేశము చిరకాలమునుండి పరదేశజాల దండయాత్రలకు గురియై యనేకవిధముల నష్టములకు పాల్పడియుండెను. కాని దేశముయొక్క అమూల్యమైన గ్రంథముల కేవిధమైన నష్టము కలుగ చేయలేకపోయెను. పూర్వకాలమందు మనదేశములో ముద్రణాయంత్రములు లేని సమయమందు, సమస్తశాస్త్రములు, యువకుల మెదళ్లలో భద్రముగ చేర్చబడి నేటికి మన కెంతయో యుపయోగకములుగ నుండుట యెల్లరకు తెలిసిన విషయమేకదా! ఆ సేధాశక్తి నానాటికిని పోయి, కేవలము పుస్తకశక్తికి అలవాటుపడి జ్ఞాపకశక్తికి శలవొసంగియుంటిమి! ఇయ్యది విచారణీయాంశము! ఈ కాలమునకు నానావిషయముల బోధజేయు గ్రంథముల నొకచోజేర్చి, ప్రజల కుచితరీతిని జ్ఞానము కలుగజేయుట నేటి పరిస్థితులబట్టి అత్యావశ్యకమని గ్రహించి, ఉద్యమవ్యాప్తికి తగిన కార్యసాధనములయోచించి, యొక ప్రణాళికను తయారుచేసి, ఆచరణయందుంచుటకు గ్రంథాలయోద్యమాభిమాను లెల్లరు సంకల్పించి, ఈ యుద్యమమును పల్లెగ్రామమునకును ప్రాకునట్టుల కృషి సలుపవలసి యున్నది. భారతదేశ మెన్ని చిక్కులలో బడినను, వ్యవసాయము చెడకుండ కాపాడబడుచుండుట చేత వ్యవసాయదారుల యుద్యమముపట్ల సానుభూతి కలుగునట్లు యోచింపవలసియున్నది. "దేవాలయములు మూలస్థానములు"గ నుండి దేశజాలకు సర్వతోముఖ జ్ఞానమును ప్రజలకు వెదజల్లుచు పూర్వమునుండియు మనదేశములో పవిత్రస్థానములుగ పరిగణింపబడుచుండెను. కాని అయ్యవి నానాటికి విసర్జింపబడి కేవలము గబ్బిలములతోను బొద్దింకలతోను నిండి దుర్వాసనాయుతం బగు స్థానములుగ నున్నవని చెప్ప సాహసించినందులకు మన్నించకోరెదు. ప్రతిగ్రామమందును నేదియో యొక దేవాలయము యిప్పటికిని కట్టబడుచునే యున్నది. ఆ దేవాలయమునే యువకులు గ్రంథాలయయులుగ మార్చి పరస్పరసహాయనిని అందు నెలకొల్పి గ్రామవాసులకు వలయు జ్ఞానము నొసగూర్చుటకు పాటుబడిన శీఘ్రకాలములో దేశమం దెల్లెడల జ్ఞానము వ్యాపించకమానునా?

భారతదేశమందు పూర్వకాలమందు తక్షశిల, నలందా, నూహానంతపురము, అమరావతి, మున్నగు సుప్రసిద్ధస్థలములందు వ్రాతగ్రంథములు చేర్చబడి యుండెడివి తాళ్ళపై ప్రజలను మిక్కిలి యుపయోగకములై విలసిల్లుచుండెడివి. 17-18, వ శతాబ్దములనుండి అచ్చువచ్చిన తరువాత కొన్నిగ్రంథములు మాత్రమే బయల్వెడలియుండెను. కొన్ని శిథిలమై యిప్పటికిని అచ్చటచ్చట రాజస్థానములందున్నయవి. తంజావూరునందు, ఆంధ్రగ్రంథములు, తాటియాకుపుస్తకములు పెక్కు గలవు. అట్టి గ్రంథములకు సరియైన ప్రతులను వ్రాయించి అచ్చొత్తించి కాపాడుట కేంద్రగ్రంథాలయముల వారి విధియని మనవిచేయుచున్నాను. ఎద్దానికిని ధనమావశ్యకము. ధనము లేక ఏకార్యమును కొనసాగనేరదు. దేశము దరిద్రముచే పీడింపబడుచున్నపుడు యిట్టి కార్యమును నెరవేరుట కష్టసాధ్యము.

గ్రంథాలయములు, ముఖ్యముగ విద్యావంతులకును, జ్ఞానవంతులకును, వ్యాపారస్తులకును వ్యవసాయదారులకును, ఇతర పనుల వారికిని నిండా యుపయుక్తముగ నుండును. గ్రంథాలయములు శిక్షాస్థలములుగ నుండి, మానవజీవితమును గడుపుటకు తగిన విషయములను బోధపరుచు గ్రంథరాజంబులం దుంచబడి, కేవలము మానసిక వికాసమునకే తోడ్పడుటయేగాక భుక్తిమార్గముచూపు గ్రంథములుకూడ నందుచేర్పబడి మానవజీవితమునకు తేజము కలుగజేయుటయే వాని కర్తవ్యమని విన్నవించుచున్నాను. ఈ సందర్భమున, మైసూరు, బరోడా, ట్రావన్కూర్, కొచ్చిన్ మున్నగు సంస్థా

నములు ముందంజవేసి ప్రజలలో జ్ఞానమును కలుగ జేయుచున్నయవి!

"విద్యావిషయము" యీ సందర్భమున మన దేశమందు "విద్య" విషయమై యొకింత యోచింపు టావశ్యకము! పాశ్చాత్య విద్యావిధానమును నేర్చి యెందరు విద్యావంతులు నేడు ఏమి చేయవలెనో తోచక యూరూరదిరుగుచు పూర్వార్జితంబగు నాస్తుల బోగొట్టుకొని భుక్తిమార్గము గానక మానుషంబున మలమల మాడి మ్రగ్గుచున్నారో యోచింపుడు. ఎట్టివిద్యయొసంగబడి మానవుడు ఇహపరములలో సుఖింపగలడో, అట్టి విద్యావిధానము నొకదానిని మన ఆంధ్రయూనివర్సిటీవారాలోచించి, యొక ప్రణాళికను తయారుచేసి అట్టి విద్యావిధానమునే విద్యాలయము నేర్పులాగున చట్టసమ్మతముగ ప్రవేశపెట్ట దేశములకు తోడ్పడ ప్రార్థితులు.

అందులకు వలయు గ్రంథముల వ్రాయించి విద్యాలయములలో బోధపరిచి యువకులకు తగు నుత్తేజము నొసంగవలెననిగాని వేరువకు సందర్భండియు, లాభము లేదని విన్నవించుచున్నాను.

ఆంధ్రదేశగ్రంథాలయసంఘము ముఖ్యముగ నాంధ్రదేశమందు గ్రంథాలయోద్యమము సర్వతోముఖంబుగ అభివృద్ధి నొందు మార్గము న్వేషింపవలయును.

(1) గ్రంథాలయోద్యమమందు పండితులెల్లర నొకచో తరుచు చేర్చుచు వివిధవిషయముల చర్చించుటావశ్యకము.

(2) ప్రతి జిల్లాయందును, తాలూకాయందును, ప్రతి గ్రామమందును గ్రంథాలయముల నెలకొల్పి తద్వారా గ్రామస్థులకు అన్ని విషయములను తెలియజేయుచు, దేశాభివృద్ధికి తోడ్పడునట్లు పనిచేయుట కర్తవ్యము.

(3) మత సాంఘిక నైతికాది వివిధవిషయములందు యీ సాంఘికులు ఐక్యము కలుగజేసికొని జాత్యభివృద్ధికరములగు కార్యముల జేయుచు, జాతియందు ఐకమత్యము, నమ్మకము, అభిమానము పెంపొందునట్లు పాటుపడవలయును.

(4) స్త్రీలు, బాలురు వీనియందీ యుద్యమము వ్యాపించునట్లు తగిన యేర్పాటుల జేయవలయును. ఇందులకు సంచారగ్రంథాలయముల నేర్పాటు చేయవలసి యున్నది. ఈ విషయము బొత్తుగ మనవారు శ్రద్ధవహించి యుండలేదు.

(5) పాశ్చాత్య గ్రంథాలయ సంఘములవారితో ముచ్చటించి వారి సలహాల తాము అడిగికొని, జిల్లా తాలూకాలవారికి అచ్చటి పద్ధతులు వాటి యుపయోగ విషయములు అప్పుడప్పుడు తెలియజేయుచుండుటకు నెల కొక పత్రిక నచ్చటచ్చట చేయుట యావశ్యకము.

ప్రతియుద్యమము, ధనాభావముచేత మొలకెత్తియు నానాటికి మసుగుజ్జువానివలె పెరిగి, తరిగిపోవుచుండునే గాని పెరిగి పేరుగాంచుట లేదని యెల్లరెఱింగిన విషయమేగదా! నేడు గ్రంథాలయోద్యమము అభివృద్ధి గాంచు సూచనలు గాన్పించుచున్నందులకు మిగుల సంతసముగ నున్నయది! ప్రభుత్వమువారు ఈ యుద్యమ వ్యాప్తికై విరివిగ ధనసహాయము చేసినయెడల అనతికాలమున భారతదేశము నేడు మరల తన నిజతేజః ప్రభావమును ప్రపంచకమునకు సూచింపక మానదని విన్నవించుచున్నాను.

సోదరులారా! మరల "గ్రంథాలయోద్యమ సువర్ణోత్సవము" జరుపునాటికి ఏ గ్రామము చూచినను గ్రంథాలయోద్యమముతో తులదూగి జ్ఞానజ్యోతితో వెలుగునట్లు మన మెల్లరము పాటుపడి ప్రతి గ్రామమందును ఒక గ్రంథాలయమును నెలకొల్పి కృతార్థులగుదుమని నమ్మి, భగవంతుని ప్రార్థించుచున్నాను.

నాకీసమయ మొసగి, నన్ను గౌరవించినందులకు ఆహ్వానసంఘమువారికి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను. తాము ఈసభను తోడ్పడి జయప్రదముగ నడిపించినందులకు తమకు వందనము లాచరించుచున్నాను.

## గ్రంథాలయోద్యమ రజతోత్సవము.

### (ఆంధ్రపత్రిక సంపాదకీయము)

బెజవాడలో నిన్నటిదినము ప్రారంభమైన గ్రంథాలయోద్యమ రజతోత్సవమున కధ్యక్షతవహించి, భారత శాసనసభ్యులగు భూపతిరాజు సీతారామరాజుగారిచ్చిన యుపన్యాసమును స్థలాంతరమున ప్రచురించితిమి. జనకులగు భూపతిరాజు వేంకటపతిరాజుగారివలె, సీతారామరాజుగారును ప్రజాహిత జీవితము

వందు పేరెన్నికగాంచి, భారతశాసనసభయందు ప్రజల హక్కులను కాపాడుటకై శ్రద్ధతో పాటుబడుచు విశాఖపట్టణమండల గౌరవమును ఆంధ్రదేశ గౌరవమును గూడ కాపాడుచున్నారు. భారతభూమియందు గ్రంథాలయోద్యమాభివృద్ధికై పాటుబడిన రాష్ట్రములలో ఆంధ్రరాష్ట్రమును ప్రధానముగ పేర్కొనవచ్చును. దేశీయ సంస్థానమగు బరోడాను మినహాయించుచో, బ్రిటీషు ఇండియాలో ఆంధ్రదేశముతో నీవిషయమున సరిపోల్పదగిన రాష్ట్రము మరియొకటి గనుపింపదు. గ్రంథాలయోద్యమమునకై యావచ్ఛక్తిని వినియోగించి, తమ అసువుల నీయుద్యమసేవకొరకే బాసిన సూరి వేంకట నృసింహశాస్త్రిగారి నామము నీసమయమున మరచుట దుర్లభము. వీరు ఆంధ్రదేశమునం దీయుద్యమమును వ్యాపింపజేయుటయేగాక, అఖిలభారతవర్షమునం దీయుద్యమమును వ్యాపింపజేయుటకై విశేషశ్రమ పడియుండిరి. కొంతకాలముక్రిందట చెన్నపురిలో బయలుదేరిన గ్రంథాలయ సంస్థ, ఆంధ్రదేశ ప్రయత్నములను చులకనజేసినను, ఆంధ్రదేశపు ఆధునిక చరిత్రమును గురించినవారికి, ఆంధ్రోద్యమమునందు గ్రంథాలయోద్యమము ఎట్టి ప్రాముఖ్యస్థానము వహించెనో తప్పక గోచరింపగలదు. సూరి వేంకటనరసింహశాస్త్రిగారితో పాటు పాటుబడి యిప్పటికిని దీక్షతో కృషి సలుపుచున్న శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యగారి సేవను గుర్తింపక వీలులేదు. వారును గ్రంథాలయోద్యమాభివృద్ధికే యావచ్ఛక్తిని ధారబోయుచున్న విషయము నిర్వివాదాంశము. ఇట్టిస్థితిలో అఖిలభారత గ్రంథాలయోద్యమమునకు రజతోత్సవమును బెజవాడ పట్టణములో జరుపు టెంతయు సంప్రీతికరము. గ్రంథాలయోద్యమము దేశమందంతటను నూతన వికాస తేజస్స్ఫూర్తితో విలసిల్లుటకు రజతోత్సవము తోడ్పడుగాక యని కోరెదము. హిందూదేశమునందును, అందు ముఖ్యముగ ఆంధ్రదేశమునందును, అజ్ఞానతిమిరము ప్రజల నధికముగ నావరించియున్నది. డా॥ శే॥ గోఖ్లే మహాశయుడు నిర్బంధ ప్రారంభవిద్యను ప్రజలకు గఱపవలయునని, చేసిన హెచ్చరిక లింతవరకు ఫలింపలేదు. ఆర్థికమాంద్యము వ్యాపించియున్న ప్రస్తుత సమయమున యీకోర్కె నెఱవేరు సూచన లసలే గనుపింపవు. ఈ కారణముచే, హిందూదేశ ప్రజలకు జ్ఞానప్రసాదము నొసగుటకు మరియొక సాధన మవసర మగుచున్నది. గ్రంథాలయములను విరివిగ స్థాపించి, సరస్వతీ పీఠములను ఎల్లెడల నెలకొల్పుటచేతనే ఇయ్యది చేకూడగలదు.

గ్రంథాలయములను సేకరించిన మాత్రాన ప్రయోజనములేదు. వాని నుపయోగించుటకు ప్రజలను ప్రోత్సాహపరుపవలెను. విద్యాగంధములేనివారి నిమిత్తము పత్రికలను గ్రంథములను చదివి వినిపించుట, పురాణపఠనము గావించుట, వివిధ విషయోపన్యాసముల నిప్పించుట మున్నగు ఏర్పాటులను గ్రంథాలయములు సలుపవలసి యుండును. సంచార గ్రంథాలయముల ఏర్పాటు అమెరికాలో విశేషవ్యాప్తిగాంచి యున్నది. గ్రంథాలయములు ప[illegible]థాన పుస్తకములతో బయలుదేరి వివిధప్రదేశములలో జ్ఞానమును వ్యాపింప జేయుచున్నవి. ఇట్టిఏర్పాటులు బరోడాలోగూడా గావింపబడుచున్నవి. ఆంధ్రదేశమునందుగూడ ఈ విషయమై ఎక్కువశ్రద్ధ వహింప నవసరము గలదు. గ్రంథాలయ యాజమాన్యమున రాత్రిపాఠశాలలను స్థాపింపవచ్చును. గ్రంథాలయోద్యమము ప్రజాహిత జీవితమున కుపకరింపవలె నను తలంపు ఆంధ్రులలో మొదటినుండియు వ్యాపించి యుండెను. ఇది కొంతవరకు నెరవేరెనని చెప్పవచ్చును. ఆంధ్రదేశప్రబోధమునకు గ్రంథాలయములు మిగుల తోడ్పడెననుటకు సందియము లేదు. రాజకీయ సంచలనమువలన గ్రంథాలయోద్యమమునకు కొరంత గలిగెనని, అధ్యక్షులు తెలిపిన విషయమునందు కొంత సత్యమున్నను, రాజకీయ సంచలనము ఈయుద్యమ వికాసమునకు తోడ్పడెననుటకు సందియములేదు. జనసామాన్యమునందు పత్రికా పఠనాసక్తియు, గ్రంథపఠనాసక్తియు విస్తరించుటకు, గ్రంథాలయోద్యమమునకు రాజకీయోద్యమము సహాయపడెననుటకు సందియములేదు. గ్రంథాలయోద్యమమునకు ప్రభుత్వమువారు తగినరీతిని తోడ్పడుట లేదని చెప్పవచ్చును. గ్రంథాలయముల విషయమున ప్రభుత్వాధికారు లాయా ప్రాంతములందు దెలుపుచున్న యభ్యంతరములు వింతను పురికొల్పుచున్నవి. ఈ కారణములచే, ప్రభుత్వసహాయమువలన గ్రంథాలయోద్యమము త్వరితగతి నభివృద్ధి గాంచుటకు వీలగునని అధ్యక్షులు దెలిపినవిషయము సత్యమే యైనను ప్రస్తుతసందర్భములలో గ్రంథాలయోద్యమమున కయినను ప్రభుత్వసహాయ మంతగ లభించునని యూహింప వీలులేదు. ఈ కారణముచే దేశపరిస్థితులు చక్కబడువరకు ప్రజలే యీయుద్యమ

మును కొనసాగించుటకు, దీక్షతో పాటుబడవలసిన యవసరము గనుపించును. మంత్రివర్గమును, స్థానిక సంఘములును యీ యుద్యమమునకు తోడ్పడ వీలున్నను, యీ విషయమున ఆశ కంతగ నవకాశము గనుపింపదు. ఏలన స్థానిక సంఘములకు ద్రవ్యాభావ మొక గొప్ప చిక్కుగనున్నది. ఈ సంఘములు స్వేచ్ఛాసంస్థలుగావు. గాన గ్రంథాలయములకు నిర్నిరోధముగ తోడ్పడజాలవు. ఇక మంత్రివర్గము వారన్ననో, వారును అధికారపరత్వైఖరినే సామాన్యముగా అనుసరించుచున్నారు. స్థానిక సంఘములు హిందీని బోధించుటకు అంగీకరింపని మంత్రివర్గము, తదితర ఉపయోగకరమగు కార్యములకు తోడ్పడునని ఎంచ వీలు గనుపింపదు. గ్రామ గ్రంథాలయోద్యమమునుగూర్చి అధ్యక్షులు తెలిపినవిషయములు చాల ముఖ్యమైనవి. గ్రామములందీ సమయమున పంచాయతు లేర్పడి యుండుటచే, గ్రంథాలయముల నెలకొల్పి వానిద్వారా ప్రజలలో జ్ఞానోదయము గావించుటకు పంచాయతుల కవకాశము మిక్కుటముగ గలదు. గ్రామప్రజల కుపయోగించెడి అనుభవజ్ఞానమును వీరు వ్యాపింపజేయవచ్చును. అధ్యక్షులు తెలిపినటుల, గ్రామములలో నిప్పటికిని వ్యాప్తియందున్న భాగవతములు, బొమ్మలాటలు మున్నగు ఏర్పాటులద్వారా, ప్రబోధము గలిగింప వీలగును.

ఎక్కడ దృఢసంకల్పముండునో అక్కడనే తత్ఫలముగూడ చేకూరును. గ్రంథాలయోద్యమమును నవకాశముగ గైకొని, పాలకులు జ్ఞానవ్యాప్తికై కృషి సలుపుచో జన సామాన్య ప్రబోధమునకు వీ రధికముగ తోడ్పడ గలుగుదురు. కాని ప్రస్తుత స్థితిలో నీ విషయమై ఆశలంతగ బాషమకుండుటచే, గ్రంథాలయోద్యమ నిర్వాహకులు స్వయంకృషిని విరమింపక, ఎక్కువ దీక్షతో పాటుబడుచు ప్రజాప్రబోధమునకు తోడ్పడ నవసరము గలదు. ఇయ్యది రాజకీయోద్యమము కానుగాన, అన్ని శాఖలవారును గూడ దీనికి తోడ్పడ వీలగును. ఆంధ్రదేశమునందు చిరకాలముక్రిందట ప్రారంభమయిన గ్రంథాలయోద్యమము మరల నూతన తేజముతో విరాజిల్లునటుల ఆంధ్రమహాశయు లెల్లరును నడుము కట్టవలయును. ఆంధ్రదేశమునందు విద్యను విరివిగా వ్యాపింపజేయగల దాతలగు ధనికు లంతగ లేరు. ఆంధ్రదేశము ప్రభుత్వదృష్టి నంతగ నాకర్షించుటకు ప్రత్యేక రాష్ట్రమూ లేదు. అందుచే గ్రంథాలయోద్యమ నిర్వాహకులు ప్రజలలో జ్ఞానవ్యాప్తికై ద్విగుణీకృత శక్తితో పాటుబడవలసిన యావసర మెంతేని గలదు. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమముయొక్క సౌష్ఠవము, జనపదములలోని వ్యాప్తిపై నాధారపడును. ఆంధ్రదేశపు పల్లెటూరులలో గ్రంథాలయోద్యమము చిరకాలమునుండియు పీఠము బెట్టుకొనియుండుట మిగుల ప్రోత్సాహకరము. అందుచే ఆంధ్రదేశమునందు గ్రామ ప్రబోధమును గ్రంథాలయోద్యమము ద్వారా విస్తారము గావింపజేయ వీలగలదు. పట్టణ గ్రంథాలయములు గ్రామములలో నీ యుద్యమము స్థిరపడుటకై తోడ్పడుచో, విశేషోపయోగ మిందువలన గలిగి గ్రామజీవనమునకు అమూల్యమగు మేలు గలుగును. బెజవాడలో జరిగిన గ్రంథాలయోద్యమోత్సవము ఆంధ్రదేశోద్ధరణమునకును, అఖిలభారత ప్రబోధమునకును గూడ తోడ్పడుగాక యని కోరెదము.

# అఖిలభారత గ్రంథాలయ ప్రదర్శనము,

## బెజవాడ.

## ఏప్రియలు 16, 17 తేదీలు, 1933 సం.



1933 సం॥ 16 వ ఏప్రియల్ ఉదయమున 8 గంటలకు బెజవాడ పట్టణమునందుగల శ్రీ రామమోహన గ్రంథాలయ భవనముయొక్క ఆవరణములో ఇందులకై ప్రత్యేకముగ నిర్మించబడి చక్కగ అలంకరించిన పందిలియందు ఏడవ అఖిలభారత గ్రంథాలయ సభ, ప్రదర్శనము ప్రారంభించబడినవి. పందిలియంతయు ప్రేక్షకులతోడను ప్రతినిధులతోడను నిండియుండెను. సభకు విచ్చేసినవారిలో కొందరు-గుడిపాటి రంగనాయకమ్మ, దేవులపల్లి సత్యవతమ్మ, బచ్చు జగన్నాథదాసు, క. భాష్యం, పత్తిపాటి సత్యనారాయణ, వేమవరపు రామదాసుపంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు, పాటిబండ్ల వెంకటరమణయ్య పంతులు, కస్తూరి నరసింహారావు, మేజర్ శంకరశాస్త్రి, ఆర్. జనార్దనంనాయుడు, జోషి, కాజ శివరామకృష్ణారావు, మాగంటి బాపినీడు, రావుబహదూరు ఎన్. రంగనాథాచార్యులు, సి. వి. రంగం శ్రేష్ఠి, సోలస హనుమానులుపంతులు, వ. సుబ్బరాజు, ఊ. వెంకట సుబ్బారాయశ్రేష్ఠి. ముక్తేవి ప్రకాశరావుగార్లు మున్నగువారు.

కార్యక్రమమునకు ముందుగా బ్రహ్మశ్రీ శతావధాని వేమూరి శ్రీరామశాస్త్రిగారు ప్రార్థన శ్లోకములు చదివిరి. పిమ్మట ప్రదర్శనమునకు ఆహ్వాన సంఘాధ్యక్షులగు కొత్తారు రామారావు పంతులు, ఎమ్. ఎ. ఎల్. టి. గారు శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారిని ప్రదర్శనముయొక్క ప్రారంభోత్సవమును జరుపునట్లు కోరుచు ముచ్చటించిరి.

### శ్రీ కె. రామారావు, ఎం. ఏ. యల్. టి. గారి స్వాగతోపన్యాసము.

అఖిలభారత గ్రంథాలయ సభతోపాటు యీ ప్రదర్శనమును జరుపుట మొదటినుండియు పరిపాటియైనది. కొలది సంవత్సరముల క్రిందట మొట్టమొదటి ప్రదర్శనము మద్రాసునగరములో జరుపపడినప్పుడు విలింగ్డను ప్రభువుగారు ఆ ప్రదర్శనమును తెరచియుండిరి. గ్రంథాలయములే విజ్ఞాన ప్రచారమునకు అగ్రస్థానము వహించుచున్నవని అప్పుడు చెప్పియుండిరి.

ఈ యుద్యమము నానాటికి బలవత్తరమై వర్ధిల్లుచున్నదేగాని బలహీనమగుట లేదు. ఈ సభోద్యమమును వెనుకకు మరలించుటకై కొందరు యత్నించుచున్నారని వినుటకు నాకు సంతాపమగుచున్నది. ఈ సభకు పోటీగ మరొక అఖిలభారత సభను ఏర్పాటు చేయవలెనని వారు ప్రయత్నించుచున్నారట. కాని, వారు తలపెట్టిన ప్రతిరూపసభను యింతవరకును సమావేశపరచజాలక సరియైన స్థలనిర్ణయము, కాలనిర్ణయము చేయజాలక వాయిదాలు వేయుచునేయున్నారు. కనుక వారి ప్రయత్నములు నిస్సారము లనియు గగ్గ్రాములనియు దానివల్లనే విదితమగుచున్నది.

గ్రంథాలయోద్యమము రెండువిధములుగా వికసింపవలసియున్నది. గ్రంథాలయములు దేశమంతటను వెల్లివిరియుటకు ప్రయత్నముల సలుపవలెను. అంతియగాక స్థాపింపబడిన గ్రంథాలయములు సక్రమముగా నిర్వహింపబడు మార్గములను గూర్చి బోధించవలెను. ఈ రెండు పనులను యీ అఖిలభారత గ్రంథాలయ సభవారే పూనుకొని చేయవలెను.

ఈ సభకు ప్రతికూలురై ప్రతిరూప సభను నెలకొల్ప యత్నించువారు తమ యత్నములను అచిరకాలములోనే విరమించి యీ సభలో చేరి సుహృద్భావముతో కృషి సల్పి యీ యుద్యమమును పెంపొందించెదరు గాక! ఐకమత్యమువల్లనే మన మే యుద్యమమునైనను సాధింపగలము. భిన్నభావములతో స్పర్ధల

తో ఈ యుద్యమమునకే భంగ మొనర్చినవార మగుదుము.

ఇట్టి ప్రదర్శనమువల్ల ప్రజాసామాన్యమునకు ప్రపంచ జ్ఞానము వృద్ధి యగుటకు అపారావకాశము కలదు.

ఈ ప్రదర్శనమునకు విచ్చేసినవా రందరికిని నేను ఆహ్వానసంఘము తరపున స్వాగత మొసంగుచున్నాను.

తుర్లపాటి గోవర్ధనరావుగారీ క్రింది పద్యములను చదివిరి.

## ఉపాయనము ( నవరత్నములు )

గోవర్ధనకవి.

ఏయమ ఆంధ్రవిష్ణుపృథి
వీంద్రసముత్కరశోభితాంకిత
శ్రీయుత సత్ప్రబంధపుం జ
రితప్రియ నల్ల ననుగ్రహించె, వా
రాయణకున్న గీతగతుల్,
రంజిత కీర్తిసుధాంశులార, మీ
రాయమ ప్రేరణమ్మున చిరాయువు
గాంచుచు దలంతు నీయెడన్ (1)

శివు నాహ్వానమ్మున చే
శివుఁ డారంభమునఁ దెలుచుఁ జెల్వమరంగన్
శివుఁ డైక్యత్వత నిల్చెడి
శివలీలామోహితులము శివ భూరమణా. (2)

విశ్వదాత, విశ్వవిభులు, విశ్వవిదిత
చరితుఁడు, సభ నుంట కవిత సార్థకమ్ము
గ్రంథ పరిషదంబ పిలుపు గణనఁ జెంద
అష్టవర్షపుఁ బరిణయ మందు; ధర్మ
సూత్రముల దెంప నొక్కనాడ సులభమగున? (3)

సిరి గోనిపోయి వంగకుల
శేఖరు నుంచుకొనె సదా సువా
క్సిరి గని; ఆంధ్రపుత్రకుల కీర్తి
దిక్కుల కెక్క; కాని ఆ
చరణయుగమ్ము సన్నిధి వి
శాలప్రభావము లల్లుకొంచు నే
ర్పరులగు భాగ్య మాంధ్రులకు రా
గలదా యను చింత దక్కెటిన్. (4)

అంకితమైన ఉద్యమమునందు
ప్రధానులు పిన్ననాడె అ
య్యంకికులీవనూరి వసుధామరులందు
ద్వితీయు డక్కటా!
అంకిలి జెంది కీర్తివని
తాంగన మీ కని యిచ్చిపోయె
ఆశంక గనుం దలంకృతి కి
బ్రార్థన సల్పెడిమిమ్ము మిమ్ములన్. (5)

సూర్యనారాయణాని కృపసొబగు దాల్ప
తలచినది: కాశీనాథుడు తలపుబూనె
గ్రంథము లిచ్చి తా నలంకరణ మీయ
ఆశ్రమము హార్దమున కొసచేసి రేయి
బవలు లనక కృషించె సత్వరము గీని
అభిమతమ్ము దీర్పరాకో? ధర్మాత్ములార! (6)

భారత భక్తితోడన ఉపాయన
మిచ్చి వరించె మిమ్ము కో
భారతులార, గ్రీష్మఋతువహ్నికి
జంకక ప్రేమనెంచి వి
ద్యారతి జూపినార లహో!
తమ రందఱు ధన్యులెన్న; ఎ
వ్వారి తరమ్ము మీ చరిత బాడగ,
మాదృశు లన్న నెంతటే? (7)

ఉన్నది ఉన్నరీతి రచనున్నది
ఆశువు జెప్ప మీగుణా
భ్యున్నతి తొక్కలే దశయోక్తుల
మార్గము వీరవాణిసిన్
మన్ననజేసి అచ్చు నభిమానము
గూర్పుడు మేలుసేతలం
దున్నవి; తీరికమ్ము మెయి
నోపికతో వినిపింతు పిమ్మటన్. (8)

అఖిల భారతమ్ము సదివి యబ్రమంద
అఖిలభారత గ్రంథ విద్యార్థనాగ్రి
పాళి గని సంతసిల్ల నబ్రంబ? ఆంధ్ర
తేజము సుపథమ్ము వరించి తేజరిలుత! (9)

పిమ్మట పుష్పమాలాలంకృతులై శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు ప్రదర్శనముయొక్క ప్రారంభోత్సవమును జరుపుచు నిటుల ముచ్చటించిరి.

## దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి ప్రదర్శన ప్రారంభోపన్యాసము.

"నన్ను ఈ ప్రారంభోత్సవమును జరుపుటకు మీరు కోరినందులకు వందనములు. మొట్టమొదట ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమమును గూర్చి ముచ్చటింపవలసి వచ్చినప్పుడు అగ్రశేషులగు సూరి వేంకటనరసింహశాస్త్రిగారి పేరును మరువజాలము. గ్రంథాలయోద్యమవ్యాప్తికై వారి జీవితకాలమున వారు చేసిన కృషి ప్రశంసాపాత్రమై యున్నది. వారు చిన్నవయస్సుననే దివంగతులైనందులకు మనచింతను వెలిబుచ్చుచు వారికి ఆత్మశాంతిని భగవంతుడు చేకూర్చుగాత మని ప్రార్థించుచున్నాము. నరసింహశాస్త్రిగారికి గ్రంథాలయోద్యమ కృషియందు చేదోడుగ నుండి అయ్యంకి వేంకటరమణయ్యగారు చేసిన సాయము అపారమై యున్నది. వారిద్దరి కృషియొక్క ఫలితమే నేడు మన మిచ్చట కనులార చూచుచున్నాము. గడచిన యిరువదియైదు సంవత్సరములలో గ్రంథాలయోద్యమము ఏవిధమున వ్యాపించినదో ఒక్కసారి మనము చూడవలసియున్నది. ఉద్యమము ప్రారంభమగుటకు పూర్వము జ్ఞానబీజములు వెదజల్లబడవలయును. అట్టి జ్ఞానసముపార్జనమునకు ఆంధ్రుల మనోవికాసము చాలియున్నదా లేదా యని ఆలోచించుటకు పూర్వము ఆంధ్రులు చేసిన కృషి ఎటుల ఫలించినదో చూడవలయును. ఎన్ని అటంకములు తటస్థించినను వానిని అన్నింటిని ఎదుర్కొని జ్ఞానమును సంపాదించి కృతకృత్యులగుటలో ఆంధ్రులు వెనుదీయరు. వారియొక్క ఉద్రేకము, ఉత్సాహము, కార్యరూపమును దాల్చుటకు ఎన్ని ప్రతిబంధము లున్నను వానిని లక్ష్యముచేయక విజయమునకై ప్రయత్నింతురు. అట్టి ప్రయత్నమే గ్రంథాలయోద్యమ సందర్భమున ఆంధ్రయువకులు చేసియున్నారు. పదునేను సంవత్సరముల క్రిందట విజృంభించి నేడు ఈ యుద్యమము మందగించినదనుట పొరబాటు. ఆంధ్రులకు అప్పుడు, నిప్పుడు కూడా ఒకవిధమైన ఉత్సాహము, ఉద్రేకము, కార్యశూరత గలవని నేను నొక్కి చెప్పగలను. ఒకప్పుడు ఒక రూపమున ప్రకాశించిన ఆంధ్రశక్తి మరొకప్పుడు వేరొకవిధముగ కార్యదక్షతను ప్రదర్శించుచున్నది. వీరేశలింగంగారి కాలములో సాంఘిక విషయములయందు ప్రదర్శింపబడిన ఉత్సాహము, ఉద్రేకము, గ్రంథాలయ, స్వరాజ్య, హరిజనోద్ధరణ మాదిగాగల యుద్యమములందు క్రియాశక్తిని వెలిబుచ్చుచున్నది. దేశముయొక్క స్వాతంత్ర్యమును సంపాదించుటకు ఎప్పటికి ఏ యుద్యమమును సాగించిన నది అక్కరకు వచ్చునో దానియందు లక్ష్యమును కేంద్రీకరింతురు. ఈ సూత్రమును విమర్శకులు మనసునందుంచుకొని ఆంధ్రదేశముయొక్క అభివృద్ధిని గడచిన యిరువదియైదు సంవత్సరముల కాలము పరిశీలించుదురేని ఆంధ్రునియొక్క శక్తి అప్పుడును నిప్పుడును మొక్కపోని పటిమతో విరాజిల్లుచున్నదని గ్రహింపగలరు. ఒకప్పుడు భావరూపమున నున్న యుద్యమము మరియొకప్పుడు కార్యరూపమున కనుపించనంత మాత్రమున ఆ యుద్యమము మందగించిన దనుట సరికాదు. మార్గములు వేరైనను ఆదర్శము లక్ష్యము నొక్కటియే యయియున్నది. కార్యరంగమున స్వాతంత్ర్యము మనకు లభింపవలెను. తమ భావములను ఎవరు సంపూర్ణముగా వ్యక్తపరచి కార్యరంగమున పెట్టుదురో వారు మహానుభావులు. ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమముతోపాటు స్వాతంత్ర్యదీపికలు వ్యాపింప జేయబడినవి. లాభాపేక్ష లేకుండగా ధర్మనిర్ణయము చేయుటకు సంపూర్ణప్రయత్నములు జరుగుచున్నవి. మన లక్ష్యమును మనము మరచిపోలేదు. ఏ యుద్యమమున కైనను ధర్మమునందు లక్ష్య ముండవలెను. అట్టి లక్ష్యములేక కేవలము నాయకమునకై పెనగులాడు ప్రయత్నమేమియు భాషాభివృద్ధికి తోడ్పడజాలదు. ఆంధ్రదేశమున గడచిన 15 సంవత్సరముల నుండి జరిగిన అభివృద్ధిని గూర్చి మనము ఆలోచించితిమేని యితర రాష్ట్రములకు మనము తీసిపోము. పత్రికానిర్వహణమునందేమి, గ్రంథ ప్రచురణము నందేమి, మనము చూపిన అభివృద్ధికి మనము గర్వపడవలసి యున్నాము. మనకు ప్రత్యేక రాష్ట్రము లేకపోవుట వలనను ఆంధ్రాభిమానములేని చెన్నపురి మనకు ప్రధాననగర మగుటచేతను మన కీర్తి పైకి రాలేదు. అందువలన మనకు తగినంత పలుకుబడి కలుగలేదు. అయితే మనము కేవలము స్వయం సహాయమువలననే పైకి వచ్చినాము. ఆంధ్రదేశముయొక్క అభివృద్ధికి దోహదమొసగిన యుద్యమములలో నేను పాల్గొనియుండుటచే ఆంధ్రదేశమును స్తుతించుటయన్న ఆత్మస్తుతియగునేమో యని భయపడు

చున్నాను. కాని నిజముగా ఆంధ్రాభివృద్ధినిగూర్చి ఎంత చెప్పినను తనివితీరదు.

ఒక బంగాళారాష్ట్రము ఆంధ్రులకంటె హెచ్చు స్థానము నలంకరించునేమో కాని యితర రాష్ట్రములు పోల్చుటకు సరిరావు. మనకు మనలనుగూర్చి చెప్పుకొనుటకు బిడియము హెచ్చు. మన నాయకులనుగూర్చి, మనము చూపిన అభివృద్ధినిగూర్చి ప్రశంసించుచు వ్రాయు పత్రికలు విశేషములేవు. మన గొప్పతనమును మనకుగూర్చి చెప్పుటకు సందేహింతుము. ఇతరులనుగూర్చి హెచ్చుగ చెప్పుకొను అలవాటు మనకు కద్దు. మనలనుగూర్చి బాగుగ నెరిగినవారు మన శక్తిసామర్థ్యములను గూర్చి హెచ్చుగ శ్లాఘించుచున్నారు. ఇక్కడ ప్రచురింపబడుచున్న భారతి వంటి పత్రికలు భారతదేశమున అతి స్వల్పముగ నున్నవని చెప్పుటకు సాహసించుచున్నాను. చిత్రకళయందు దామెర్ల రామారావుగారు చూపిన మార్గము ప్రశంసాపాత్రమైయున్నది. ఆంధ్రులకు ప్రత్యేక వ్యక్తిత్వము కలదని రామారావుగారు నిరూపించిరి. భావకవిత్వమునందుగూడ ఆంధ్రకవులు ముందంజవేయుచున్నారు. ఒకటననేల సకలరంగముల యందు ఆంధ్రులు కృషిసల్పి జయభేరిని మ్రోయించుచున్నారు. అవరణాస్థానబలము తగినంత ద్రవ్యసహాయము లేకున్నను అనేక కష్టనిష్ఠురములకు లోనుగావలసి వచ్చినను ధైర్యోత్సాహములను విడనాడక, ధర్మమార్గమును వీడక కేవలము స్వయంసహాయము మీదనే ఆధారపడి ఆంధ్రులు అనేక మహత్కార్యములను సాధించియున్నారు. విశాలహృదయముతో మనము రాజమార్గమున పోవుచున్నాము. లాభములు, ప్రాపకములతో మనకివసరములేదు. ఆటంకములకు వెనుదీయము. కష్టములకు భయపడము. స్వాతంత్ర్యపు భావమునందలి లక్ష్యమును వదలము. మద్రాసు రాష్ట్రమునందు మాటివవంతుగల ఆంధ్రులు యిట్టి సుగుణసంపన్నతతో కార్యశూరతతో పూర్వపు ఔన్నత్యస్థితికి రాగలరని నా దృఢవిశ్వాసము. అట్టి ఔన్నత్యస్థితికి గొంపోవుటకు యిట్టి గ్రంథాలయ ప్రదర్శనములు సాధనములు కాగలవు. ఈ ప్రదర్శనమునందు ప్రదర్శించబడిన వానివలన మనకు లాభము చేకూరుగాకయని నమ్ముచు యీ ప్రదర్శనమును తెరచుచున్నాను.

## ప్రదర్శనము.

ప్రదర్శనపు గ్రంథములు, పటములు, పత్రికలు మున్నగునవి రామమోహన గ్రంథాలయ భవనమునందమర్చబడినవి. ఆంధ్రదేశమునందలి గ్రంథాలయోద్యమాభివృద్ధిని సూచించు గ్రాఫులు, పటములు, పత్రికలు, గ్రంథములు ప్రదర్శించబడినవి. గుంటూరుజిల్లాయందలి ఉద్యమాభివృద్ధిని సూచించు గ్రాఫు ప్రత్యేకముగ తయారుచేయబడి ప్రదర్శింపబడి యున్నది. వేటపాలెం, అంగలూరు మున్నగు ప్రదేశములలో గ్రంథాలయోద్యమ మెటుల వ్యాపించినది స్పష్టమగునటుల చిత్రపటముల మూలమునను, లిఖితరూపమునను ప్రదర్శించబడినది. ఆంధ్రోద్యమవ్యాప్తికై పాటుపడిన నాయకులయొక్క చిత్రపటములు ప్రదర్శించబడినవి. ఇటులనే ఆస్ట్రేలియా, అమెరికా, ఇంగ్లాండు మున్నగు దేశములలో గ్రంథాలయోద్యమవ్యాప్తికై పాటుబడిన వారియొక్కయు, సాయమొనర్చినవారి యొక్కయు చిత్రపటములు గలవు. అనేక పత్రికలు, పుస్తకములు ప్రదర్శించబడినవి. ఆంధ్రదేశమున పూర్వమునుండి నేటివరకు ప్రచురించబడిన ముఖ్యమైన పత్రికలు గ్రంథములు ప్రదర్శించబడినవి. ఇట్లు ప్రదర్శించబడినవానిలో ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము, భారతి మున్నగునవి ప్రత్యేకముగ పేర్కొనబడవలసి యున్నవి.

మద్రాసు చాకలిపేటలోని శ్రీ నటరాజ సభవారిచే సేకరింపబడిన ఆంధ్ర, తమిళ, ఆంగ్లపత్రికలు, సంచికలున్నూ ప్రదర్శింపబడినవి. ఆంధ్రచరిత్ర పరిశోధక మండలివారి పరిశోధనలును వెల్లడిచేయు పత్రికలున్నూ దివ్యజ్ఞానసమాజమువారి గ్రంథములున్నూ. కేవలము బాలురకు ఉపయోగించు గ్రంథములును అటులనే ప్రదర్శించబడినవి.

# 7వ అఖిల భారత గ్రంథాలయ మహాసభ.



శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు గ్రంథాలయ ప్రదర్శనమునకు ప్రారంభోత్సవము జరిపిన తదనంతరము ఏడవ అఖిలభారత గ్రంథాలయ మహాసభ ప్రారంభించబడినది. ఆహ్వాన సంఘాధ్యక్షులగు చల్లపల్లి జమీందారుగారు శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాదబహదరువారు ప్రతినిధులకు స్వాగత మొసంగుచు ఉపన్యసించిరి.

## చల్లపల్లి జమీందారగు శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద బహదూరుగారి స్వాగతోపన్యాసము.

అఖిలభారత గ్రంథాలయ మహాసభ బెజవాడలో సమావేశమగుట కిదియే మొట్టమొదటి పర్యాయము. ఇట్టి అఖిలభారత మహాసభ యొకటి ఏర్పడవలెనని సంకల్పము ఈ బెజవాడయందే మొట్టమొదట అవిర్భవించెను. ఆ సభావ్యవహారములను యీ నగరమునందుండిన నూరి వేంకట నరసింహశాస్త్రిగారే నడపించుచు వచ్చిరి. బ్రిటిషు ఇండియాలో గ్రంథాలయోద్యమ మను దానిని ఉపక్రమించినది నరసింహశాస్త్రిగారే- కనుక అట్టి యుద్యమమునకు జన్మస్థానమైన యీ బెజవాడలో యీ సభజరుగుట చాల యుక్తముగానున్నది. ఆ నరసింహశాస్త్రిగారు నేడు మనతో నిచట లేక స్వర్గస్థులై యున్నారు. వారు తలపెట్టిన యుద్యమమును జయప్రదముగా కొనసాగించుటకు మన మందర మిచట సమావేశమై యున్నాము.

ఈ గ్రంథాలయమువలన దేశమునకు చేకూరగల లాభములు అపారములు. దేశములో ప్రజలకు అక్షరజ్ఞానము హెచ్చినకొలందియు యీ సభవారు యీ గ్రంథాలయములద్వారా ప్రజలయందు కలుగజేయ దగిన జ్ఞానప్రబోధము బహువిధములుగా వెలయగలదు.

ఈ 7వ అఖిలభారత సమావేశమును జరుపుటకు కొంత కాలయాపనమైనది. దేశమందలి ఆర్థికదురవస్థయే యిందుకు కారణము.

దేశములో ఆర్థిక దురవస్థ లెట్లున్నను, రాజకీయాందోళనము లెట్లున్నను గ్రంథాలయాభివృద్ధిని మాత్రము నిరోధించుటకు వలనుపడదు. గ్రంథాలయము ముఖ్యముగా జనసామాన్యమునకు ఎక్కువగా ఉపకరించును. వారికే యివి అత్యంతావశ్యకములు. ఎందువల్లననగా విద్యాధికులును ధనాధికులును తమ స్వంతద్రవ్యమును వెచ్చించి స్వంత గ్రంథసంచయమును సేకరించి యుంచుకొనగలరు. కాని జనసామాన్యమునకు జ్ఞానదాయకములైన సరస్వతీ పీఠములు కొన్ని సుకరములై సులభములై వెలయవలెను.

గ్రంథాలయములను కాలక్రమేణ దేశములో అసంఖ్యాకములుగా విస్తరింప జేయవలెను. మనదేశమందుగల 760,000 గ్రామములందును గూడ గ్రామమున కొక్క గ్రంథాలయము చొప్పున ఏర్పడవలెను. ఇందు కొరకై ప్రభుత్వ సహాయము అవసరమను మాట నిజమే కాని, కేవలము ప్రభుత్వమువారే యావత్తు భారమును వహించి సర్వసన్నాహములను చేయవలయునను వాదననే నంగీకరింపను. దేవాలయముల సంస్కరణమున్నగు తదితర సంస్కరణముల విషయములోవలెనే యీ గ్రంథాలయాభివృద్ధి విషయములోగూడ ప్రజలు తమయందు గల ఉత్సాహాభిలాషను కార్యరూపమున ప్రకటించవలెను. కనుక ప్రజల కార్యాసక్తి కార్యదీక్షల ననుసరించి ప్రభుత్వమువారు చేయూతనొసగి సహాయము చేయవలయును.

ప్రతిగ్రామములోను ఒకచిన్న గ్రంథాలయము సందర్భావసరముల కొలంది, శక్తికొలంది ఏర్పాటు చేయవలెను. అట్టి గ్రంథాలయము గ్రామవాసుల సద్గోష్ఠికి నిలయమై సద్విషయముల నేర్చుకొనుట కొక జ్ఞానమందిరమై వెలయగలదు.

అట్టి సద్గోష్ఠి సత్సంగత్వమువల్ల గ్రామములలోని పార్టీలు కక్షలు అంతరించి గ్రామజీవితము సౌఖ్య

# సప్తమ అఖిల భారత ధర్మగ్రంథాలయ మహాసభ,

బెజవాడ, 16 - 17 ఏప్రియల్ 1933.



ఆహ్వాన సంఘాధ్యక్షులగు

శ్రీరాజా యార్లగడ్డ శివరామ ప్రసాద బహద్దరుగారు

# 15వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, బెజవాడ.

10, 11, 12 ఆగస్టు, 1933.



ఆహ్వాన సంఘాధ్యక్షులు

గోపు రామచంద్రరావుగారు.





అధ్యక్షులు

పి. సీతారామరాజుగారు.

కరమై శుభప్రదమై యొప్పుజను. కనుక ఇట్టి యావద్భారత గ్రంథాలయ వ్యాప్తికి యీయావద్భారత గ్రంథాలయ మహాసభవంటి యొక కేంద్రసంఘము కృషిచేయవలెను. గవర్నమెంటువారుకూడ గ్రంథాలయములకును, సాహిత్య కళాభివృద్ధులకును సంబంధించిన యొక పరిపాలనాశాఖను ఏర్పరించవలెను. కనుక యీవిషయమై గ్రంథాలయోద్యమ నాయకులందరును శ్రమించవలెక పాటుబడి ప్రభుత్వమువారిని అట్టిపనికి పురికొల్పవలెను.

ఆయాగ్రంథాలయముల నిర్వహణముల విషయములోగల వ్యవహారభేదములను, నూతన పద్ధతులనుగూర్చిన వివరములను, తారతమ్యములను, ఆ విషయమునందు సామర్థ్యానుభవముగల నిపుణులు నిర్ణయించగలరు కాని, దేశమంతటను గ్రంథాలయములను విస్తరింపజేయు విషయములో ప్రజావారును పూనుకొని కృషిచేయనగును. ఆహ్వానసంఘము తరఫున మీకందరకిని ఈ 7 వ అఖిలభారత గ్రంథాలయ సభాసమావేశ సందర్భమున స్వాగత మొసంగుచున్నాను.

పిమ్మట పుష్పమాలాలంకృతులై శ్రీ ధర్మవీర వామననాయకుగారు సభకు ప్రారంభోత్సవమును జరుపుచు ఉపన్యసించిరి.

## ధర్మవీర వామననాయక్ గారి ప్రారంభోపన్యాసము.

ఈ సభకు ఉపక్రమణోపన్యాసము నొసంగవలసినదిగా నన్ను కోరిరి. కాని నేను విద్యావంతుడను గాను. పటబిరుదములు లేవు. కాని, శ్రీయుత డి. టి. రావుగారును, అయ్యంకి వేంకటరమణయ్యగారును నన్ను బలిమాలుటవలన, నా యనుంగుమిత్రులమాట త్రోసివేయజాలక యిందుల కంగీకరించితిని. గ్రంథాలయోద్యమ పరమార్థమును గూర్చి తత్త్వవిచారణ నేను చేయబూనుకొనను. ఆ విషయ మంతయును పండితోత్తములైన యీ సభాధ్యక్షులే మీకు తెలియజెప్పగలరు.

ఈ సభ నుపక్రమించుటకు సర్వసమర్థుడైన భగవంతుడు మనకు తోడై, యీయుద్యమము యొక్క నిజతత్త్వమును సంకల్పోద్దేశములను గ్రహించుటకు వలయు వివేకమును గ్రహించుగాక యని ప్రార్థించుచున్నాను. మన మీ సభలో చేసెడి తీర్మానములను ఆచరణలోనికి దెచ్చుటకై వలయు స్థిరసంకల్పమును ధైర్యమును గూడ ఆ భగవంతుడు మనకు అనుగ్రహించుగాక.

అక్షరజ్ఞానము గల ప్రతివానికిని గ్రంథాలయము అక్కరకు రాగల సత్త్రప్రస్థాపనయై యున్నది. వార్తాపత్రికలును, పాఠశాలలును ఏ విధముగా దేశమందు జ్ఞానబీజములను నాటగలవో అదేరీతిగా నీ గ్రంథాలయములు కూడ జ్ఞానబీజములను నాటగలవు. పూర్వయుగములలో గూడ తామ్రశాసనముల మూలమునను స్తూపములపై చెక్కబడిన శిలాశాసనముల మూలమునను ప్రజలకు ధర్మమార్గములు బోధింపబడెను. తాటియాకు పుస్తకములమీద సద్గ్రంథము లన్నియు లిఖింపబడి భద్రము చేయబడెను.

అట్టి యుత్కృష్ట గ్రంథములను జాగ్రత్తగా దాచియుంచుటకై రాజ్యాధిపతులు చాల ధనమును వెచ్చించి శ్రద్ధవహించియుండిరి. కాని, మతాంతరులును ఖండాంతరులును ఈ దేశముపై దాడివెడలి ఈగ్రంథసముదాయములను పెక్కింటిని నాశనము చేసి మానవకోటికి అపారమైన అపకార మొనర్చియుండిరి. భూర్జపత్రములయందు లిఖింపబడిన వేదగ్రంథము లనేకములు కాశ్మీరములో శారదాపీఠమునం దుండెడివట. తారారు దేశమునుండి దండెత్తివచ్చిన తురుష్కులు ఆ గ్రంథసంపుటి నంతను కృష్ణా గంగపాలు చేసిరట. కాని, భారతీయుల భాగ్యవశమున ఆనాటి పండిత ప్రకాండు లందరును ఆగ్రంథకోశము నంతను కంఠస్థముచేసియుండుటవల్ల వంశపరంపరగా అనుశ్రుతమై నేటికిని మనకు నిలిచియున్నది.

ముద్రణాయంత్రము, కాగితము మన కిపుడు వెలసినవి. ఈ రెంటిమూలమున విజ్ఞానము విశ్వమానవకోటికి నేడు సులభసాధ్యమైనది. అమూల్యవిషయములు గల గ్రంథములు అనుదినము వెలువడుచున్నవి. వీని నన్నింటిని స్వీకరింపగల గ్రంథాలయములు తేనెతుట్టెలవలె ప్రజలకు ప్రపంచమునందుగల వివిధ విజ్ఞానవిషయములను అందజేయుచున్నవి. అట్టి గ్రంథాలయములను విజ్ఞానపీఠములను దేశమునందు విస్తరింప జేయవలెను. ఇది ప్రభుత్వమువారియొక్క ముఖ్యకర్తవ్యము. ప్రజలు కూడ ఇందుకు నడుము కట్టి పనిచేయవలెను.

అట్టి గ్రంథాలయములు ప్రజలకు సత్కాలక్షేపమునకు నిలయములై జీవితధర్మములను ప్రజలు నేర్చుకొని సన్మార్గవర్తనులగుటకు ఆధారభూతము లగును.

గ్రంథాలయములమూలమున దేశములో గ్రంథపఠనాసక్తి పురికొల్పబడును. గ్రంథములలోని రహస్యములను గ్రహింపగల్గుటకై ప్రజలు చదువనేర్చుకొనుటకు కుతూహలమానసు లగుదురు. అక్షరజ్ఞానముకలవారి సంఖ్య యిందువలన హెంపుగాంచును.

సాహిత్యము, కళ, తత్వశాస్త్రము, మున్నగు వివిధ విషయములనుగూర్చి, ప్రజలలో వికాసము కలుగును. విద్యావంతులగువారికి యీగ్రంథాలయములవల్ల నూతన పరిశోధనలనొనర్చ నవకాశ మేర్పడును. మానవకోటి యొక్క విజ్ఞాన మీగ్రంథాలయములందు గొప్ప ధననిధి వలె దాచబడియుండును. వ్యయప్రయాస లక్కరలేకుండ ప్రతివారికిని సకలశాస్త్రవిషయములును అందుబాటులో నుండగలవు ఏగురువునొద్దకూడ సకలవిషయములును ఎవ్వడును నేర్చుకోజాలడు. గ్రంథాలయములు లేకుండ విద్యాభివృద్ధికి వలయు ఏర్పాట్లు సమగ్రము గాజాలవు. పాఠశాలలందు జనులకు జ్ఞానపిపాస కలుగజేయబడును. ఆదాహమును తీర్చుటకు గ్రంథాలయములు చలివెందరలవంటివి. జాతీయాభివృద్ధిదాయకము లయిన యే యుద్యమమును తలపెట్టినను గ్రంథాలయములు ఆయుధములవలె సాధనములై యుండును.

గ్రామములోని గ్రంథాలయములు సహజముగా చిన్న సంచయములై యుండును. పట్టణములలోని గ్రంథాలయములు పెద్దవై యుండును. కాని పట్టణములలోని గ్రంథాలయములలోని ముద్రితములను పలువిధములైన గ్రంథములను గ్రామ గ్రంథాలయములకు తరచు అందజేయుటకై సంచార గ్రంథాలయములు కొన్ని యేర్పడవలెను.

ఇట్టి వ్యవహార నిర్వహణ రహస్యము లనేకములు కలవు. ఇవన్నియు అధ్యక్షులు మీకు విపులముగా విశదీకరింపగలరు.

భారతదేశములో గ్రంథాలయోద్యమమునకు పునాది వేసి దారి చూపినది బరోడా మహారాజగు శాయాజీ రావు గైక్వారుగారు. వారు మనయందు పురిగొల్పిన యుత్సాహమే యీ యుద్యమ పరంపరాభివృద్ధికి మనకు ఆధారభూతము కాగలదు.

ఆంధ్రదేశములో యీ యుద్యమమునకు కీర్తిశేషులగు నూరి వేంకట నరసింహశాస్త్రిగారు మార్గదర్శకులైరి. వారు ఢిల్లీడిప్యుటీయందు పనిచేయుచుండినను యీ యుద్యమవ్యాప్తికై ఎక్కువ కృషి సల్పియుండిరి. వారి శక్తినంతయును దీనికి ధారపోసిరి. బరోడా మహారాజాగారివలె అధికారసంపన్నులును, ప్రభువులును గాకపోయినను ఇంతటి ప్రబోధమును యీ దేశములో కలుగజేసియుండుట హెచ్చుగా మెచ్చదగిన విషయము. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు యీ యుద్యమమునకు యీ దేశములో రెండవ పట్టుకొమ్మగా నున్నారు. వీరిద్దరును ఢిల్లీశపు పట్టుతో పనిచేసిరి.

ఈ యుద్యమము, యీ సభ జయప్రదముగా నెరవేరవలెనని కోరుచున్నాను.

ఉదయమున సభ ఇంతటితో పూర్తియైనది. సాయంత్రం 4 గంటలకు అధ్యక్షోపన్యాసము, సభకు సంబంధించిన మిగిలిన కార్యక్రమము జరుగగలదని సన్మాన సంఘాధ్యక్షులవారు సభవారికి తెలియజేసిరి.

## మొదటి దినము మధ్యాహ్న సమావేశము.

అఖిలభారత గ్రంథాలయ మహాసభ మరల యీ రోజు సాయంత్రం 4-30 గంటలకు సమావేశమయ్యెను. శ్రీయుత డాక్టరు వంగల శివరామగారిని అధ్యక్షులుగా నుండవలసినట్లు కోరుచూ, శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఉపపాదించగ శ్రీయుత మాగంటి బాపినీడుగారు బలపర్చిరి. అనంతరము డాక్టరు శివరాంగారు పుష్పమాలాలంకృతులై అధ్యక్షపీఠము నధిష్ఠించి తమ యుపన్యాసమును చదివిరి. అంతట ఆహ్వానసంఘ కార్యదర్శి శ్రీవిక్రమరావుగారు సభ జయప్రదముగ జరుగవలయునని కోరుచు పెద్దలనేకులు వ్రాసిపంపిన సందేశములను చదివిరి.

శ్రీయుతులు డాక్టరు లంక సుందరంగారు; బి. ఎస్. రావుగారు, టి. సి. గోస్వామిగారు, కుమారమణీంద్ర దేవ్ రాయ్‌గారు, షణ్ముఖ మొదలియారుగారు, కె. యస్. బి. కె. స్వామిగారు. దిరాజ్‌చంద్ శర్మగారు, బి. యస్. రామసుబ్బయ్యర్‌గారు, యం. కే. శ్రీనివాసయ్యంగారు, శ్రీమతి అత్యం సత్యవతీదేవిగారు, సిలోనులో వాణిజ్యమంత్రిగారయిన పేరి సుందరంగారు, ఎస్. కృష్ణరావుగారు మొదలగు ప్రముఖులు పంపించిన సందేశములను సభవారికి చదివి వినిపించిరి.

పేరి సుందరంగారు సిలోనుప్రజలు మీ సభయొక్క కార్యక్రమమును మిక్కిలి కుతూహలముతో

# సప్తమ అఖిల భారత ధర్మగ్రంథాలయ మహాసభ,

బెజవాడ, 16 - 17 ఏప్రియల్ 1933.



ప్రదర్శనము.



దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు
ప్రదర్శన ప్రారంభోపన్యాసము నొసంగుట.

# సప్తమ అఖిల భారత ధర్మగ్రంథాలయ మహాసభ, బెజవాడ.

ఏప్రియలు 16, 17 తేదీలు, 1933




ప్రతినిధులు.

నిరీక్షించుచు మీరు గ్రంథాలయముల ద్వారా ప్రజాసామాన్య విద్యావ్యాపకమునకు తోడ్పడగలరని నమ్ముచున్నారు' అని తెలిపిరి. వంగదేశ గ్రంథాలయసభాధ్యక్షులగు కుమారమణీంద్రదేవ్ రాయిగారు 'బెజవాడలో మా మిత్రులు గ్రంథాలయోద్యమమునందు ప్రారంభమునుండియు ముందంజవేసి యున్నారు. వారు మరల తదుద్యమమును కొనసాగించుట మిక్కిలి ప్రశంసనీయము' అని సందేశ మంపిరి.

## వంగల వెంకటశివరాము, ఎం. ఏ., పి. హెచ్. డి., ఎఫ్. ఆర్. హెచ్. ఎస్., గారి అధ్యక్షోపన్యాసము.

గ్రంథాలయోద్యమము వయోజనవిద్యాభివృద్ధికి సహాయభూతముగ నుండునన్న యంశము సర్వత్ర గుర్తింపబడెను. దేశములో తగినన్ని గ్రంథాలయములు లేనప్పుడే జాతియు విజ్ఞానవంతమై ప్రపంచ వికాసమునకు తోడ్పడజాలదు.

### కార్యక్రమము

ముందు చూపవలసిన కార్యవిధానము నాలోచింపవలయును. ముందు చేయవలసిన కార్యమేది? దానికి వ్యయ మేమగును? దానిని నిర్వహించువారెవరు? దానిని త్వరలో నిర్వహించు టెట్లు? ప్రతిపాఠశాలయందును ప్రతి గ్రామమందును, పట్టణమునందును, మునిసిపలు పట్టణమునందును విధాయకముగ నొక గ్రంథాలయ ముండితీరవలయును. గ్రంథాలయములోని పుస్తకములను తెచ్చుకొని పాఠశాల విద్యార్థులు చదువుకొను నలవాటును వారికి కలిగింపవలయును. అదియుగాక పాఠశాల విద్యార్థులలో 10, 12 యేండ్లువచ్చినప్పటినుండి గ్రంథాగారములోని పుస్తకములనేగాక, మునిసిపాలిటీ గ్రంథాలయములందలి పుస్తకములు చదువు నభ్యాసము చేయవలయును. వారున్న పట్టణములందు మ్యూజియము లున్నయెడల వానిని చూపుచు వానిని గురించి పాఠశాలలలో చెప్పుచుండవలయును. ఇట్లువారికి చిన్నప్పుడే శ్రద్ధయును, నుత్సాహమును కలిగించిన యెడల వారు పెద్దవారైనప్పుడు పుస్తకములు చదువుచు జ్ఞానమార్జించు నభ్యాసము పట్టుబడును. అట్లు చేయుటవలన యువజనులకు గ్రంథాలయములందు రుచి కలుగును. పాఠశాలలో చదువుకొనుచున్నప్పుడు విద్యార్థికి యభ్యాసము, రుచిని కలిగించిన యెడల వారు పెద్దవారైనను దానిని మరచిపోక చదువుట కలవాటు పడుచుందురు. పాఠశాల వదలిపెట్టు లోపలనే వారికా యభ్యాసము పట్టుబడునట్లు చేయవలయును.

ఇప్పుడు వయోజనవిద్యకుండిన సౌకర్యములు చాల యల్పము. భారతదేశములోగల జనసామాన్యావసరములను పాటించుట కిప్పటి కెట్టి నిక్కపు ప్రయత్నము జరిగియుండలేదు. వయోజన విద్యావిషయమై విచారణ చేయుటకు బ్రిటిషువా రిదివరలో నొకసంఘము నేర్పరచిరి. జాతీయాభివృద్ధి కది శాశ్వతావసరమనియు, పౌరులకుండవలసిన లక్షణమున కిది యావసరమనియు, నందుచే వారియేర్పాటు సర్వత్ర శాశ్వతముగ నుండవలయుననియు వారు యుక్తముగ తెలియజేసిరి. దీనికి తోడు గ్రామములందు గ్రంథాలయము లుండవలయును. దీని కేమి వ్యయమగునో యోచింపవలయును. ప్రతిగ్రామమందు, పట్టణమునందు జిల్లాయందు భాండాగారములు పెట్టించుటకు చాలధనమవసరము. ప్రజలును ప్రభుత్వము వారును కలిసి తోడ్పడినప్పుడే యిది కొనసాగును. ప్రతి రాష్ట్రమునందు ప్రభుత్వము దీనికొరకై కొంత సొమ్ము ప్రత్యేకము ఖర్చుపరచుచుండవలయును. ప్రజల దగ్గరనుండి విరాళములు పోగు చేయవలయును. ఆయా ప్రాంతములందు విద్యాభివృద్ధికి భాండాగారస్థాపనమునకు పన్ను వసూలు చేయవలయును. అంతయు ప్రభుత్వమే చేయవలయునని మనము తలపకూడదు. ప్రజలు స్వాభివృద్ధికి పాటుపడుచు ప్రభుత్వ సహాయము నపేక్షింపవలయును. అమెరికాలోని కార్నెజీ వంటి శ్రీమంతులు తోడ్పడని యెడల నక్కడి యుద్యమము ఫలవంతమై యుండెడిది కాదు. మనదేశమునందు నట్టి దాతలు లేకపోలేదు. వారి నడుగవలసిన విధముగ నడిగిన వారు ధనసహాయము చేయక పోరు. దానివలన కొంత కార్యసిద్ధి కాగలదు. పదిసంవత్సరము లిట్లు పాటుబడిన యెడల ప్రతిగ్రామమునందు, పట్టణమునందు పుస్తకభాండాగారములు తలయెత్తకపోవు. పశ్చిమగోదావరియందలి అత్తిలి నాస్వగ్రామమై యున్నది. ఇక్కడనెందరో విద్యావంతులు తలయెత్తి యెన్నియోవిధముల పేరుప్రతిష్ఠలు గడించియుండిరి. కాని అక్కడ గ్రంథాలయమును నెలకొల్పి యుండలేదు. అక్కడ గ్రంథాలయ స్థాపనమునకు నేను కొంతసొమ్మిచ్చెదను. కొన్ని పుస్తకములనుకూడ నొసంగెదను. అత్తిలి

యందు చాలమంది ధనవంతులు గలరు. వారు దీనినిబట్టి గ్రంథాలయమును వృద్ధిచేయవచ్చును. కేవలము ధర్మాత్ముల సహాయమే చాలదు. గ్రామస్థులనుండి వసూలగు పన్నులో కొంతద్రవ్యము దీనిక్రింద వినియోగపడవలయును. దీనికి శాసనముండినప్పుడిది సాధ్యపడును.

చెన్నపురి శాసనసభ్యులిందుకొరకు ప్రయత్నించి పుస్తకభాండాగారములకు ప్రభుత్వసహాయము కలుగునట్లు చేయింపవలెను.

## బరోడాలో జరిగినపని.

బరోడాలో పుస్తక భాండాగారోద్యమము చాల వ్యాప్తియం దున్నది. 1910 నుండి అది ప్రారంభమయ్యెను. బరోడా మహారాజావారు రెండవ పర్యాయము అమెరికాదేశమునకు వెళ్ళినప్పుడు గ్రంథాలయపు ఏర్పాటులందు వన్నెగాంచిన డబ్ల్యు. ఎ. బోర్డనుగారి తోడ్పాటును పొంది వారి నందుకు నియోగించిరి. వారు బరోడాలో మూడు సంవత్సరములకాలమునుండి చాల కృషిచేసిరి. ఇప్పు డాకార్యమును న్యూటను దత్తుగారు నిర్వహించుచున్నారు.

బరోడాలో కేంద్రగ్రంథాగారము కలదు. గ్రామములందును పట్టణములందును కూడ గ్రంథాగారములు కలవు. కేంద్రగ్రంథాగారము మాతృసంఘము వలె నుండి తక్కినవానికి తోడ్పడుచుండును. అక్కడ ఉచితముగా పుస్తకములను చదువుకొనవచ్చును. వారు పుస్తకములను ఇండ్లకు కూడ నిచ్చెదరు. ఇది గాక దానికిచేరి పత్రికాపఠనమందిరము కలదు. స్త్రీల యుపయోగార్థము కూడ ప్రత్యేకము ఏర్పాటులు కలవు. పిల్లలకు క్రీడామందిర మొకటి యున్నది. అక్కడ బాలురు వినోదముగ కాలక్షేపము చేయుటకు తగిన యేర్పాటు లున్నవి. కేంద్రగ్రంథాగారమునుండి చాల పుస్తకములు చదువుకొనువారికి పంపుచుందురు. మన దేశములోని గ్రంథాలయములలో నిది మూడవదిగానే యుండును. ఇందు 124,000 పుస్తకము లున్నవి. గత సంవత్సరములో 182,500 సంపుటములను చదువుకొనుట కిచ్చియుండిరి. పట్టణములకు గ్రామములకు పుస్తకములు తీసికొనిపోయియు నక్కడకు పెట్టెలలో పంపించియు పుస్తకము లిచ్చుచుందురు. పుస్తకములు కోరిన పాఠశాలలకు గాని, ఇతర గ్రంథాలయములకు గాని మరి ఇతర సంఘములకు గాని వారుచితముగ పుస్తకములు పంపించుచుందురు. తమకు గ్రంథాలయ శాఖవారికి పంపుటకును తిరిగి తుదకు చేరుటకును అగు ఖర్చులను భరించుచుందురు. ఇట్లు నిరుడు 22000 సంపుటములను ప్రజలు చదువుకొనుటకు పంపించియుండిరి.

గ్రామ గ్రంథాలయములకు సంస్థానమువారు ధనసహాయము చేయుదురు. 1906 నుండి ఇది జరుగుచున్నది. **1919** నుండి గ్రంథాలయశాఖ నొకటి నెలకొల్పిరి. అది అప్పటినుండి పనిచేయుచున్నది. గ్రామస్థులుగాని పట్టణవాసులుగాని రు **100**, రు **800**, రు **700** లో జమచేసికొనినప్పుడు అంతసొమ్మును గ్రంథాలయశాఖవారిచ్చెదరు. జిల్లాబోర్డువారు కూడ ఇంక అంత సొమ్మునిచ్చెదరు. కొన్ని సమయములలో మునిసిపాలిటీలు కూడ సొమ్మిచ్చుచుండును. గ్రంథాలయ భవనమునకు ప్రజలు 1/3 వంతు సొమ్మును పోగుచేసినయెడల తక్కినసొమ్ములో చెరిసగమువంతున ప్రభుత్వమువారును జిల్లాబోర్డువారును ఇచ్చెదరు. క్రొత్తగ గ్రామములలో గ్రంథాలయములను ప్రారంభించినప్పుడు నూరు రూపాయల గుజరాతీ పుస్తకములను పాతిక రూపాయలకే గ్రామస్థుల కిచ్చెదరు. తక్కిన ముప్పాతిక రూపాయలను ప్రభుత్వమువారు భరింతురు.

స్వీయాభివృద్ధికి గ్రంథాలయములను నెలకొల్పుకొను సౌకర్యములు పొందుటకు ప్రజలు మందమతులై యుండలేదు. మొత్తముమీద 45 పట్టణములందు 818 గ్రామములందును ఉచిత గ్రంథాలయములను నెలకొల్పిరి. వానిలో 612,406 పుస్తకములున్నవి. వానిని సంవత్సరమునకు చదువువారి సంఖ్య 79406 మంది. **4,25,811** సంపుటములు ప్రచారములోనుండెను. పత్రికాపఠనమందిరములు **110** యున్నవి. ఇరువదియేండ్లలో నింతకార్యము నెరవేరియుండెను. ఇంతపని జరిగియుండుట ప్రోత్సాహకరముగ నున్నది. 119 గ్రంథాలయములకు సొంతభవనములు కలవు. అసిస్టెంటు క్యూరేటరుగారు గ్రంథాలయములకు వెళ్ళుచు నవి యెట్లుగ నున్నది లేనిది చూచివచ్చుచుండును. చాలమంది గ్రంథాలయ నిర్వాహకులను చుట్టుపట్లనుండి ఒక స్థలమందు సమావేశముచేసి వాని నెట్లు నిర్వహింపవలెనో బోధించుచుందురు. ఇతరవిషయములను చర్చించుచుందురు.

సంస్థానములోని ప్రదేశములో 65.64 వంతుభాగమునందు గ్రంథాలయములు పత్రికాపఠనమందిరములు తలయెత్తి పనిచేయుచున్నవి. దీనివలన విజ్ఞాన వ్యాపకము కలుగునని సంస్థానాధీశునకు దృఢభావము కలిగెను. ఆరాజ్యమున 418 గ్రామములందు పాఠశా

లున్నవి. ఆరాజ్యమున గ్రంథాలయములేని గ్రామమునం దెల్ల వానిని పెట్టింపవలయునని సంస్థానాధీశుడు గ్రంథాలయశాఖవారిని కోరెను. దీనికి కావలసిన కట్టుబాటులుచేసిరి. ఆ సంకల్పము 4 యేండ్లలో పూర్తిగాగలదు.

చాలాలో యను గ్రామమందు 3 వేల మంది ప్రజలున్నారు. అక్కడ మంచి గ్రంథాలయము కలదు. దానిని బాగుగ నిర్వహించుచున్నారు. పాఠశాలోపాధ్యాయు లొకరు దానికి గౌరవకార్యదర్శిగనుండి పని చేయుచున్నారు. స్త్రీలు గ్రంథాలయమునకు రాకపోయినను వారికి ఇండ్లకు పుస్తకములు పంపించుచున్నారు. గ్రామమునందలి ముఖ్యవిషయములన్నిటిని గ్రంథాలయ భవంతి సింహద్వార పు గోడలమీద వ్రాసియున్నారు. గ్రామములో నెన్ని పట్టాలున్నవో ఎంతెంత విస్తీరముకలదో అక్కడి అరికలెన్ని కట్టి సేద్యము చేతురో, ఎద్లెన్నియున్నవో మున్నగు సంగతులన్నింటిని అక్కడ వ్రాసిరి. స్త్రీలకును, బాలురకును ప్రత్యేక గ్రంథాలయములు కావలయునను సంకల్ప మిటీవల బయలుదేరెను. స్త్రీల కొరకు 6 గ్రంథాలయములును, బాలురకు 4 గును నెలకొల్పిరి. వారికొరకు 8 పఠన మందిరము లున్నవి.

బరోడా సంస్థానములో సాధ్యమైన పని మన దేశములోని ఇతర రాష్ట్రములందును సాధ్యమగును. దానికి నాయకులు, ద్రవ్యము, కట్టుదిట్టములు, సంకల్పము కావలయును.

## ఆంధ్రదేశము.

1919 లో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు చెన్నపురియందు ప్రథమ భారతగ్రంథాలయ మహాసభను జరిపించిరి. బెజవాడలో 1914 నందు పేరే ప్రథమ ఆంధ్ర గ్రంథాలయ మహాసభను జరిపించిరి. అప్పుడు 168 మంది గ్రంథాలయ నిర్వాహకులు సమావేశమైరి. అప్పటినుండి ఆంధ్రదేశములోని గ్రంథాలయోద్యమము వృద్ధిగాంచెను. హైద్రాబాదు సంస్థానమునందలి ఆంధ్రప్రాంతము నందలి మండలములందు విరివిగ గ్రంథాలయములను నెలకొల్పుచున్నారు. 1886 లో విశాఖపట్టణమునందు ప్రథమ గ్రంథాలయమును, పఠనమందిరమును సరస్వతీ లైబ్రరీ యనుపేరిట నెలకొల్పియుండిరి. భీమవరము తాలూకాలోని కుముదవల్లి యందలి గ్రంథాలయము పురాతనమైయున్నది. దానిని 1897లో నెలకొల్పిరి. దాని తరువాత రాజమహేంద్రవరము నందలి గౌతమీ లైబ్రరీని చెప్పవలయును. దానిని 1900 లో నాళము కృష్ణారావుగారు స్థాపించిరి. అది ఆంధ్రదేశమునందలి గ్రంథాలయములలో పెద్దదని చెప్పవలయును. దానియందు పదివేల గ్రంథము లున్నవి. 1914 నుండి గ్రంథాలయముల సంఖ్య పెరుగుచు వచ్చెను. అంతకు పూర్వము పఠనమందిరములు క్లబ్బులు తలయెత్తెను. 1914లో 289 గ్రంథాలయము లుండ 1918 లో నవి 475, 1930 కి 600 అయ్యెను. గ్రంథాలయోద్యమమును సూరి వేంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వేంకటరమణయ్యగార్లు ప్రారంభించి కృషి చేసిరి. 1915 లో రెండవ గ్రంథాలయ మహాసభ జరిగెను. గ్రంథాలయ సర్వస్వమను పత్రికనుకూడ నడిపిరి. 1917 లో బరోడాలో జరిగిన గ్రంథాలయ ప్రదర్శనమునకు వేంకటరమణయ్యగారు వెళ్లియుండిరి. అక్కడ చూచినదాని వలనను, ప్రోత్సాహము వలనను ఉద్యమమునకు నూతన జీవము కలిగెను.

1914-20 మధ్య చాల గ్రంథాలయము లేర్పడెను. గ్రంథాలయ సేవకులను తయారుచేయుటకు 1920 లో తరగతు లేర్పరచిరి. గ్రంథాలయముల సంఖ్య 600 అయ్యెను. పత్రిక వర్ధిల్లెను. ఆంధ్రోద్యమమునందంతర్భాగముగ నిది బాగుగ వ్యాపించియుండెను. నైజాము రాష్ట్రమునందలి ఆంధ్రమండలములలో 1920 28 మధ్య గ్రంథాలయములు వృద్ధిపొందెను. రాజకీయోద్యమమునకు దీనికి నేటి సంబంధము నుండకూడదు. ఇట్టి సంబంధము లేనప్పుడు భావిస్థితి బాగుండును. మతవిషయములతో గాని, కులభేదములతో గాని దీని కెట్టి సంబంధముండకూడదు. గ్రంథాలయములు కేవలము విజ్ఞాననిలయములై యుండవలయును. అక్కడ ఉపన్యాసములు మున్నగునవి జరుగుచుండవలయును. అక్కడ ప్రజలు ఐకమత్యముతో కార్యములు జరుపుకొను తత్పరత్వమును పొందవలయును. హరికథలు, ఆరోగ్యవిధులు, సంఘౌన్నత్యముల విషయమై యుపన్యాసముల నిప్పించుచుండవలయును. కట్టుదిట్టముగ నిట్లు జరుపుటచే వయోజన విద్యాభివృద్ధికి ముఖ్యసాధనముగ నుండగలదు. పురాణములు మున్నగువానివలన విజ్ఞానము వ్యాపింపజేయుట వీధినాటకములు, కవిసమ్మానము, వక్తృత్వ పోటీ పరీక్షలు మొదలైనవానిని యేర్పాటుచేయుట మొదలగు కార్యములను గ్రంథాలయములు ముఖ్యముగా ఆచరింపవలయును. దీనివలన ప్రజల

కాంతేని లాభకరముగ నుండును ఇట్లు ప్రజాసేవ చేయుటకంతేని వీలున్నది. కుముదవల్లి గ్రంథాలయమందు, వైద్యశాలనుకూడ నడిపెదరు బీదల కుపచార గృహ మొకటికూడ కలదు. ప్రార్థన సమాజమువా రక్కడ భజనలు జరపించుచుందురు. గ్రంథాలయము నందే సహకారసంఘముకూడ నున్నది. గ్రామస్థుల సంచలనమున కంతకు నది కేంద్రమువలె నున్నది.

## నిర్ణీతమైన కార్యవిధానము

ఇప్పుడు నిర్ణీతమైన కార్యవిధాన ముండవలయును. ప్రభుత్వమువారి, శాసనసభ్యుల, ప్రజల, దృష్టి నాకర్షించుటకు ప్రచారము జరుపవలయును. గ్రంథాలయ విధానము ముఖ్యావసరమని వారికి నచ్చచెప్పవలయును కొన్ని సంవత్సరములవరకు మనమిట్లు ముఖ్యముగ ప్రచారము చేయవలయును. మనము నెరవేర్చవలసినవి చాల కార్యములున్నవి. ఇప్పుడు గ్రంథాలయము లన్నియు కలిసి ఏకవిధమున పనిచేయునట్లు యేర్పాటు చేయవచ్చును. కేంద్రస్థానమునందు మాతృకముగ నుండునట్లొక గ్రంథాలయమును పెట్టింపవచ్చును. గ్రంథాలయములయందున్న గ్రంథములన్నిటికిని గలిపి, సంయుక్త గ్రంథపట్టిక నొక దానినితయారు చేయవచ్చును. గ్రంథముల పట్టికలను, పత్రికల జాబితాలను అముద్రిత గ్రంథముల పట్టికలను ప్రకటింపవచ్చును. గ్రంథాలయ నిర్వాహకులకు శిక్షను చేయుటకు యేర్పాటు చేయవచ్చును. గ్రంథభాండాగార వృత్తియందలి గౌరవమును పెంపొందింపవచ్చును. పుస్తకములను విక్రయించువారినుండి సౌకర్యములుపొందుటకు ప్రయత్నింపవచ్చును. ఇట్టి యెన్నియో యేర్పాటులు చేయవచ్చును. ఉద్యమము వికసించి బలము చేకూరినకొలదిని వీనిని జరుపుటకు యత్నింపవచ్చును. ఇవియన్నియు ముఖ్యావసరములై యున్నను అన్ని ప్రాంతములలోను గ్రామములలోను ముఖ్యముగ గ్రంథాలయములనుపెట్టించు కార్యమును ఆరంభములో జరిపి దానిని నిర్వహించిన వెనుక దీనినంతను తలపెట్టవచ్చును. గ్రంథాలయ ప్రయోజనమును ప్రజలకు తెలుపుటకును ప్రజలనుండి సొమ్ము ప్రోగుచేయుటకును బరోడాలో చేయుచున్నట్లు గ్రంథాలయ వార్షికోత్సవములను జరుపు యేర్పాటులు చేయవలయును.

## గ్రంథాలయ చట్టము

ఇతరదేశములలో గ్రంథాలయ చట్టమున్నది. దాని ననుసరించి అక్కడ గ్రంథాలయములను పోషించుచు పాలించుచున్నారు. మనదేశమునందు అట్టిచట్ట ముండవలయును. చీనాలోను, జపాను, ఫిలిప్పైను దీవులలో నిట్టి చట్టము లేర్పడియున్న తరువాతనే గ్రంథాలయములు వికసించుటకు వీలుకలిగెను. భారతవర్షము వెనుకబడకూడదు. మనకు గ్రంథాలయములు యేర్పడుటకును విజ్ఞానాభివృద్ధికిని చట్ట ముండవలయును. వివిధ రాష్ట్రములలోనివారందరు ప్రయత్నింపవలయును. వివిధ దేశములలో జరుగు గ్రంథాలయ సంచలనము నందును మనకు ప్రమేయ ముండవలయును. 1928 లో నింగ్లాండులో జరిగిన ఆంగ్లగ్రంథాలయ మహాసభకు దాసు త్రివిక్రమరావుగారు ప్రతినిధిగ వెళ్లియుండిరి. వారక్కడ మన గ్రంథాలయోద్యమము విషయమై వ్యాసము చదివిరి. దానిని వారు ప్రకటించిరి. ఈయేడు చికాగోలో అంతర్జాతీయ గ్రంథాలయ మహాసభ జరుగును. అక్కడకు ప్రతినిధిని పంపించుటయో తగిన సందేశమును పంపించుటయో చేయవలయును. ఈ సభకు యస్. యస్. నెహూరా ఐ. సి. యస్. గారును వారి భార్యగారును అఖిలభారత ధర్మగ్రంథాలయ సంఘపక్షమున ప్రతినిధిగ వెళ్ళియున్నారు. ప్రాచ్యగ్రంథముల పరిశోధనము జరుపునట్లు పురికొల్పవలయును. గ్రంథాలయ పత్రికను తిరిగి ప్రారంభించి నడుపవలయును.

ప్రజలు విజ్ఞానాభివృద్ధికి పాటుబడవలయును. పుస్తకములు చదువు రుచిని కలిగింపవలయును. ప్రతిదినము పుస్తకములు చదువుటకు శ్రద్ధవహించు ప్రోత్సాహము పుట్టింపవలయును. అప్పుడు గ్రంథాలయములు విధాయకముగ నుండవలసిన స్థితి యుదయించును. ప్రజలలో నిట్టి తత్పరత్వము కలిగినప్పు డది వర్ధిలునేగాని క్షీణింపదు. అట్టిస్థితి గోచరించినప్పుడు ఆ జాతి వర్ధిలి మానవసౌఖ్యమునకు తోడ్పడుచుండును.

## జనార్దనం నాయుడుగారి ఉపన్యాసము.

అనంతరము మద్రాసు కనెమారా గ్రంథాలయాధ్యక్షులు ఆర్. జనార్దనంనాయుడుగారు "గ్రంథాలయనిర్మాణము-వ్యాప్తి" అను శీర్షికపై మిక్కిలి గంభీరమగు నుపన్యాసమొసగుచు ప్రాచీన నాగరికతలయొక్క చరిత్రలను పరిశోధించిన యెడల ప్రాచీన రాజ్యౌన్నత్యమునకును ప్రాచీన వాఙ్మయముల ఉచ్ఛస్థితికిని కారణము అప్పుడు వెలసియుండిన గ్రంథాలయములే యని కనుపట్టుననియు రోము, గ్రీసులందును

మనదేశములోను విలసిల్లిన హిందూరాజ్యములున్ను వీని కళావైభవమున్ను అలరించిన యెడల అప్పుడు ఆ యాదేశములందు అపారమైన గ్రంథసంపత్తిని కల్గి విజ్ఞాన తేజఃపుంజములను వెదజల్లుచుండిన గ్రంథాలయములెన్నియో యుండెననియు చెప్పిరి.

ఉపన్యాసకులు తమ విదేశపర్యటనములో యూరపుఖండమందలి పురాతననగరములను సందర్శించినపుడు అచ్చట పురాతనములగు గ్రంథాలయ భవనములను ఎన్నిటినో వారు చూచినట్లున్ను మనదేశమునందున్ను పూర్వము ప్రాచీన హైందవ విశ్వవిద్యాలయములైన తక్షశిల నలంద పట్టణములయందు నెలకొని యుండిన గొప్ప గ్రంథాలయములయందు జ్ఞానోపాసకులు పెక్కురు చీనా, జపాను మొదలగు దూరదేశములనుండి వచ్చి జ్ఞానోపార్జన చేసికొనినట్లు నిదర్శనములు కలవనియు చెప్పిరి. కాని గ్రంథాలయవ్యాప్తికి నిర్మాణశక్తి మిక్కిలి అవశ్యకమైన అంగీభూతమనియు తాము పాశ్చాత్య దేశములందు సందర్శించిన గ్రంథాలయములన్నిటియందును అందు ముఖ్యముగా అమెరికాయునైటెడ్‌స్టేట్సు వారి గ్రంథాలయములందును వారు ముఖ్యముగ గమనించినది నిర్మాణశక్తియే ముఖ్య విశేషమనిన్ని చెప్పిరి. మన దేశమందు కార్మికులకును వ్యవసాయిక జనులకును అనుకూలమగు గ్రంథాలయములు వ్యాప్తి గాంచుట అత్యావసరమనియు, జానపదులయొక్క అవసరములకున్ను గ్రాహకతా శక్తికిన్ని అనువైన గ్రంథాలయములు నిర్మించుటకు ఒక నిర్మాణ కార్యక్రమమును నిర్వహించగలినట్టి గ్రంథాలయ నిర్మాణశాస్త్రమునందు అధీతులైనట్టి కార్యకర్తలున్ను మిక్కిలి అవశ్యకమనియు ఉపన్యాసకులు నుడివిరి. విశ్వవిద్యాలయములందు పట్టపరీక్షయందు ఉత్తీర్ణులైనంత మాత్రముననే విద్యార్థులయొక్క జ్ఞానోపార్జన పూర్తికాదనియు నిజమైన జ్ఞానము విద్యాలయము వదలిన నాటినుండియు అలవర్చుకొనవలసి యున్నదనియు అట్టి జ్ఞానమును సంపాదించుటకు గ్రంథాలయములు జన సామాన్యమునకు అనువైన సాధనములనియు కాబట్టి సదరు గ్రంథాలయ వ్యాప్తికి అందరమును తోడుపడవలసియుండుననియు చెప్పి తమ యుపన్యాసమును ముగించిరి.

అంతటితో మొదటిదినము సభాకార్యక్రమము ముగిసినది.

## శ్రీ చల్లపల్లి రాజావారి విందు.

నేటి సాయంత్రము అఖిలభారత గ్రంథాలయ మహాసభకు విచ్చేసిన ప్రతినిధులకు ఆహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీ చల్లపల్లి జమీందారులగు శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహదరుగారు తమబంగాళాయందు అల్పాహారవిందును నేర్పాటు చేసిరి. దాదాపు మూడువందలమంది అతిథులు విందుకు విచ్చేసిరి. అల్పాహారములు, తేనీరు, మున్నగునవి అతిథులు సంతుష్టిగ నారగించినపిమ్మట శ్రీ రాజాగారియొక్క ఔదార్యమును, విద్యాభిమానమును, మరియు వారికిగల సహజ సౌశీల్యాది సుగుణములనుగూర్చి ప్రశంసించుచు టి. రామారావుగారు ఉపన్యసించిరి. శ్రీ రాజావారు ఉచితరీతిని అతిథులకు వందనముల నర్పించిరి. సంతోషముగ కాలముగడిపి అతిథులు తమవాసములకు వెడలిరి.

## మ్యాజిక్ లాంతరు ఉపన్యాసము

రాత్రి సభామందిరమందు శ్రీయుత మాగంటి బాపినీడు, ఎం. యస్. సి. గారు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ వ్యాప్తిని గూర్చియు, గ్రంథాలయములు ఎటుల జనసామాన్యమునందు విజ్ఞానమును వ్యాపింపజేయగలవను విషయమునుగూర్చియు మ్యాజిక్ లాంతరు సహాయమున చక్కని యుపన్యాసము నొసంగిరి. ఈయుపన్యాసమును వినుటకు అనేకమంది వచ్చియుండిరి.

## రెండవనాటి కార్యక్రమము.

గ్రంథాలయమహాసభ రెండవరోజు ఉదయము మరల సమావేశమైనప్పుడు ఆంధ్రచరిత్ర పరిశోధక మండలి సభ్యులయిన ఎమ్. రామారావుగారు ప్రాచీన హైందవ విద్యావిధానము అను శీర్షికను గురించి బహు విపులముగా అనేక చరిత్రాంశములను వెల్లడించుచు తక్షశిల, నలంద, నడియ మొదలగు విశ్వవిద్యాలయములయందు ప్రబలిన విద్యావిధానము విశదీకరించిరి.

అనంతరము నరసింహదేవర సత్యనారాయణగారు గ్రామపునర్నిర్మాణ విషయమును గురించి గంభీరోపన్యాసము చేయుచు మన గ్రామములలోని ప్రజల

యొక్క దృక్పథము మార్చుటకు గ్రంథాలయములు అవసరమే. అయినను గ్రంథాలయములకు అనుబంధముగా మన ప్రాచీన సంప్రదాయములోని పురాణ కాలక్షేపములు, హరికథలు, భజనలు, జంగంకథలు, వీధిభాగవతములు యివి యన్నియు యుండినగాని గ్రామమునందలి ప్రజలయందు ఒక విధమైన నూతన ప్రబోధము, నూతన చైతన్యము కలుగజాలదనియు, కేవలము గ్రంథసంచయ మాత్రమున గ్రామ జీవితమున కించిత్ మాత్రము సంచలనము కలుగదనియు నుడివిరి. తాము అలమూరు మొదలగు గ్రామములయందు చేయుచున్న పనిని విశదీకరించుచు, పైచెప్పిన వాటికి తోడు ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక మొదలగు వార్తాపత్రికలు ప్రతిగ్రామమునందును భాగవతాది పురాణముల వలెనే అనుదినము ప్రచారకులచేత చదివించి జనసామాన్యమునకు ప్రతిదినము దేశమునందు జరుగుచున్న వార్తలను తెలియజేసి తద్వారా ప్రాపంచిక జ్ఞానమును నిరక్షరులయినవారికి కూడా కలుగజేయుచున్నారనియు గ్రామస్థులీ వార్తలను తెలిసికొని వాటి నవగాహనము చేసికొనుటకు ఎంతయో శ్రద్ధ, యుత్సాహము చూపెట్టుచున్నారనియు, కాబట్టి గ్రంథాలయములకు తోడు పురాణశ్రవణము, పత్రికాపఠనము మొదలగు నవికూడ అనుసంధించి గ్రామములం దుద్బోధనము చేయుట అత్యవసరమని వాక్రుచ్చిరి.

అనంతరము సి. వి. రంగంశ్రేష్ఠిగారు పల్లెటూరి గ్రంథాలయములు అనే విషయమును గూర్చియు, జనార్దనం నాయుడుగారు గ్రంథాలయ పరిపాలనా విధానమును గూర్చియు మాగంటి బాపినీడుగారు గ్రంథాలయములద్వారా జనసామాన్యమునకు విద్యను వ్యాపింపజేయు పద్ధతులను గూర్చియు నుపన్యసించిరి.

ఈరోజు సాయంత్రము 4 గంటలకు సమావేశమైనప్పుడు విషయనిర్ణయ సభవారిచే ప్రవేశపెట్టబడిన తీర్మానములు చర్చింపబడి ఆమోదింపబడెను.

## తీర్మానములు

గ్రంథాలయ సభయందు క్రింది తీర్మానములు జరిగినవి:—

ప్రతిరాష్ట్రమునందును గ్రంథాలయములు పెట్టతోడ్పడుటకును, ఏషరతులేకుండ వానిని పోషించుటకును విరివిగ శాసనసభలు ధనసహాయము చేయవలసినదని ఈ సభవారు వేడుచున్నారు.

జిల్లా, తాలూకాబోర్డులును, మునిసిపాలిటీలును తమ యధికారములో నున్న ప్రదేశములందు ప్రజల కొరకు గ్రంథాలయములను పెట్టి పోషింపవలయు నని ఈ సభవారు కోరుచున్నారు.

దేశములోని పౌరులు ప్రతి జిల్లాయందును, తాలూకాయందును, గ్రామమందును గ్రంథాలయ సంఘములను నెలకొల్పి గ్రంథాలయములు పెట్టించి గ్రంథాలయోద్యమమునకు తోడ్పడవలసిన దని;ఈ సభవారు కోరుచున్నారు.

దేశములో నిప్పు డున్న గ్రంథాలయ నిర్వాహకులు తమ యాజమాన్యముక్రింద గ్రంథాలయోద్యమము ప్రజానురంజక మగునట్లు ప్రయత్నించి కార్యక్రమమును తలపెట్టి విద్యావంతులకును, విద్యావంతులు గానివారికిని, ప్రబోధము కలిగింపవలసిన దనియు ఈ సభవారు కోరుచున్నారు.

భాషాప్రయుక్త రాష్ట్రముల ననుసరించి రాష్ట్రీయసంఘముల నేర్పరచి వివిధ గ్రంథాలయ సంఘముల కార్యక్రమము నేకముఖముగ జరుపుచుండుటకును అట్టి రాష్ట్రీయసంఘములు సర్వభారత సంఘములో చేరి ఉద్యమప్రచారమునకు వెంటనే కార్యక్రమము జరుపుటకును ఈ సభవారు సిఫార్సు చేయుచున్నారు.

దేశభాషలలోని పుస్తకముల జాబితాలను పాశ్చాత్యపద్ధతుల ప్రకారము తయారుచేయుటకు వీలుకాదని యనుభవముచే తెలిసియుండుటవలన దీనిని యోచించి తగిన సలహా చెప్పుటకు సభవారు క్రిందివారితో కూడిన సంఘము నేర్పరచుచున్నారు.

(1) ప్రభాత కుమార ముఖర్జీ. (2) ఆర్. జనార్దనం నాయుడు, బి. ఏ., ఎల్. టి., డి. ఐ. (అక్సైను) (3) వి. శివరాం. 4. కె. యస్. కె, స్వామి, బి. ఎ, ఎల్. ఎల్. బి., ఏ. ఎల్. ఏ. (5) టి. సి. దత్తా. (6) డి. టి. రావు, బార్. ఎట్-లా గార్లు.

ప్రజాసామాన్యమున కుపయోగకరముగ నుండు ప్రభుత్వ ప్రకటనములను గెజట్టులు, కౌన్సిలు రిపోర్టులు, పరిపాలన రిపోర్టులు, వ్యవసాయ బులిటనులు, ఆరోగ్యము, పారిశుద్ధ్యము మున్నగువానికి సంబంధించిన బులిటనులు డబ్బుపుచ్చుకొనకుండ ధర్మగ్రంథాలయము

కును విశ్వవిద్యాలయ గ్రంథాలయములకును పంపుచుండవలయునని భారత ప్రభుత్వమును రాష్ట్రప్రభుత్వములను ఈసభవారు కోరుచున్నారు.

రిజిస్ట్రేషను ఫీజు 50 రూపాయలు ధర్మగ్రంథాలయములు పఠనమందిరములు రిజిస్ట్రేషనుకు చెల్లింపనక్కరలేకుండుటకు 1860 (XXI) చట్టమును మార్పించవలసినదని భారత శాసనసభవారిని ఈసభవారు కోరుచున్నారు.

కొన్ని మునిసిపాలిటీలు, జిల్లా, తాలూకాబోర్డులు పెద్ద సాహాయ్యము చేసి గ్రామగ్రంథాలయములు పఠనమందిరములు పెట్టుటకును, తోడ్పడుటకును పూనినందులకు సభవారు తృప్తిని కనపరచుచు తక్కినవారెల్ల అనుసరించుటకు వీరు చూపిన ప్రేరణకు అభినందించుచు, గ్రంథాలయములు 1/3 సొమ్మును కూర్పవలచినప్పుడు ప్రభుత్వమువారు 1/3 వంతును, మునిసిపాలిటీగాని జిల్లా, తాలూకాబోర్డుగాని తక్కిన 1/3 వంతును మంజూరుచేయు ఏర్పాటు ప్రకారము ద్రవ్యమిచ్చుటకు రాష్ట్రీయ శాసనసభలును భారతసభయు తగిన కట్టుబాటులు చేయవలసియుండునని ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు.

తదనంతరము అధ్యక్షులవారి యుపన్యాసముల తోడను అధ్యక్షులకును ప్రముఖులకును వందన సమర్పణము తోడను సభ జయప్రదముగ సమాప్తి చేయబడినది.

## ఆంధ్రపత్రికాభిప్రాయము.

అఖిలభారత గ్రంథాలయ సమావేశమును, అఖిల భారత గ్రంథాలయ ప్రదర్శనమును గూర్చి నిన్నటి దినము బెజవాడలో ప్రారంభమై యుండుట సముచితమై యొప్పుచున్నది. గ్రంథాలయోద్యమము బెజవాడ నగరమునందు పుట్టి పెరిగి, దేశమంతటను వ్యాపించెను. ఇందుకు యావజ్జీవము వినియోగించి, తమ జీవితమును ధారపోసిన కీ॥ శే॥ సూరి వేంకట నరసింహశాస్త్రిగారి నామము ఈ సమయమున కృతజ్ఞతతో స్మరింపవలసియున్నది. వారియొక్కయు, అయ్యంకి వేంకటరమణయ్యగారి యొక్కయు పట్టుదలయు, కార్యదీక్షయు, ఏమాత్రము మరువదగినవి గావు. అఖిలభారత సమావేశమున కధ్యక్షత వహించిన లక్నో వాస్తవ్యులును ఆంధ్రప్రముఖులు నగు డాక్టరు వంగల శివరామ్‌గారి ప్రారంభోపన్యాసము భావగర్భితమై యొప్పుచున్నది. గ్రంథాలయోద్యమమునకును, వయస్సు వచ్చినవారి విద్యకును అవినాభావసంబంధ మెట్టుల గలదో వీరు వివరించిరి. వయస్సు వచ్చినవారికి విద్య నేర్పుటకొరకు నుపాయములు, అమెరికా సంయుక్త రాష్ట్రములలో విశేషముగ నేర్పడియున్నవి. అట్టి యవకాశములను హిందూదేశమును చేపట్టవచ్చును. ప్రతిగ్రామమునందును గ్రంథాలయములను స్థాపించి, వానిని విజ్ఞాననిలయములుగ గావింపవచ్చును. చీనా ఏమన, ఫిలిప్పైను దీవులలో గూడ గ్రంథాలయోద్యమము విద్యావ్యాప్తికి విశేషముగ తోడ్పడుచుండగ, హిందూదేశమునందేల సాధ్యపడదు? అధ్యక్షులు సూచించినట్లుల హిందూదేశమందెల్ల బరోడా సంస్థానమువారీ యుద్యమమునకు విశేషముగ చేయూత నొసంగిరి. బరోడాకు పిమ్మట ఆంధ్రదేశ మీ సమయమున అధికోత్సాహమును జూపినది. ప్రభుత్వ ప్రోత్సాహ మంతగ లేకున్నను కార్యకర్తలవలననే ఈ యుద్యమము వ్యాపించినది. ఆంధ్రదేశమునందు గ్రంథాలయోద్యమము ప్రజాపురోభివృద్ధికి తోడ్పడెను. అనుకూలపరిస్థితులు చేకూరుచో, ఈ యుద్యమము ఆంధ్రదేశమునకును, ఇతర రాష్ట్రములకును గూడ మహోపకారము గావించుననుటకు సందియములేదు. అధ్యక్షులు సూచించినట్లుల, నిశ్చిత కార్యక్రమ మేర్పడి సంతత కృషి జరుగవలెను. గ్రంథాలయముల యుపయోగమును ప్రజలు గ్రహించుచో, ఇది జాతీయజీవితమున కత్యవసరమను సత్యమును తప్పక గ్రహింతురు. ఆంధ్రదేశమీ విషయమున ముందంజవైచి అఖిలభారతదేశమునకు మార్గము జూపి, సూరి వేంకటనరసింహశాస్త్రిగారికి సముచితమైన తగిన కృతజ్ఞత జూపుగాక యని కోరెదము.

# స్వవిషయము.

భగవదనుగ్రహము వలనను పెద్దల యాశీర్వచనప్రభావము వలనను "గ్రంథాలయ సర్వస్వము"ను తిరిగి ప్రారంభింప గలిగితిమి. ఆంధ్రదేశమందున్న గ్రంథాలయోద్యమ సేవకులనేకులు చేయూత నొసంగెదమని వాగ్దానముజేసిరి. గ్రంథాలయోద్యమ సేవకై పాటుబడుటకు గాను సంపూర్ణమగు సావకాశమొసంగుటకై భగవంతుని ప్రార్థించుచున్నాము.

# ఆంధ్రభాషాగ్రంథముల వర్గీకరణము.

## ప్రస్తావన.

ఇంగ్లండు అమెరికా దేశములందు విశేషముగా సమస్త పుస్తకాలయములందు ముఖ్యముగా రెండువిధములైన విభాగపద్ధతు లాడుకయందున్నవి. అవియె సర్వత్ర అంగీకరింపబడినది. వాని పేరు డాక్టరు డ్యూయీ అను నాతని డెసిమల్ లేక దశాంశపద్ధతి, కట్టర్ అను నాతని ఎక్సుపాన్సివు (Expansive) లేక విస్తరణ శీల పద్ధతి అనునవి. డ్యూయీ తనపద్ధతియందు ముఖ్యముగ పదివిభాగములను గ్రహించి, అందు ప్రతిదానిని తిరిగి పదివిభాగములుగ జేసియుండెను. కట్టరు అను నతడు ఏ (A) మొదలుకొని (Z) వరకు యిరువదియారు విభాగములుగ జేసి ప్రతివిభాగమును ఏఏ, ఏబి, ఏసి, (Aa, Ab, Ac,) ఈ విధముగా ప్రత్యక్షరమునకు తిరిగి 26 అంతర్విభాగములను జేసెను. ముఖ్యమైన ఈరెండు విభాగపద్ధతులేగాక, ఇంక మరికొన్ని పద్ధతులు ఇంగ్లాండు అమెరికాలయందును, ఇతరదేశములందును వాడుకలో యున్నవి బ్రౌన ప్ద్ధతి మేరిల్ పద్ధతి మొదలగునవి. కాని ఇవియన్నియు పీనంత ప్రసిద్ధమైనవిగావు. బరోడా కేంద్ర గ్రంథాలయమునందు ఆంగ్లేయ గ్రంథములకొరకు బోర్డను అను అమెరికాదేశ గ్రంథభాండాగారికుడు (Librarian) ఒక నవీన పద్ధతిని కల్పించెను. ఈపద్ధతి పై చెప్పిన రెండు ప్రసిద్ధపద్ధతులను ఆధారము చేసికొని కల్పింపబడినది. దీనియందు ముఖ్యముగా కట్టర్ మహాశయుని పద్ధతి ననుసరించి అక్షరక్రమముగా విభాగములు చేయబడినవి. ఈ అక్షర విభాగములన్నియు తిరిగి డ్యూయీ పద్ధతి ననుసరించి ఉపవిభాగములుగా చేయబడినవి. గ్రంథకర్తలయొక్క అను క్రమణిక ఆంగ్లేయగ్రంథకర్తలపేర్ల ననుసరించి బోర్డను గారు స్వయముగా తయారుజేసిరి.

బరోడా కేంద్రగ్రంథాలయమందు మహారాష్ట్ర పుస్తకములయొక్క వర్గీకరణ పద్ధతి బోర్డను మహాశయుని పద్ధతిననుసరించి అవసరమగు మార్పులతో చేయబడినది. ఇటువంటి విభాగము న సి. డి. దలాల్ ఎం. ఎ. గారు బరోడా కేంద్రగ్రంథాలయమందున్న గుజరాతీ పుస్తకములకొరకు తయారు చేసిరి. ఇదియు, బరోడారాజ్యమందలి చాల గ్రంథాలయములయందు వాడుకలోనున్నది. దలాల్ గారి గుజరాతి విభాగ పద్ధతియందును, మహారాష్ట్ర విభాగ పద్ధతియందును కొన్ని స్థలములందు మార్పులున్నవి. కాని ఇతర విషయములలో రెండును విశేషించి సమానముగానే యున్నవి. బరోడాయందలి కేంద్రగ్రంథాలయము హిందూస్థానమునందు మిక్కిలి అభివృద్ధిలో నున్నట్టిది అగుటచే ఇచ్చటి సర్వవిధములైన ఏర్పాటులనుగూర్చి హిందూస్థానమందలి అనేక భాగములవారు తరుచుగ నడుగుచుండుటచే దీనినిగూర్చిన సర్వవిషయములు క్రమముగ నచ్చొత్తించి ప్రకటించిరి. ఆదృష్టితోనే మరాటపుస్తకముల వర్గీకరణ పద్ధతియు ముద్రింపబడినది. ఈ పద్ధతి శాస్త్రసమ్మతమగుటచే మహారాష్ట్ర దేశమందలి ఇతర గ్రంథాలయములకు మిక్కిలి యుపయోగముగా నుండుననియు అంతటను శీఘ్రముగా వాడుకలోనికి వచ్చుననియు ఆశతో దానినికూడ ప్రచురించిరి.

బరోడా కేంద్రగ్రంథాలయమందు వాడుకలో నున్న ఈ పద్ధతుల ననుసరించి. ఆంధ్రగ్రంథములకు అనువుగ నుండునటుల గ్రంథవర్గీకరణపద్ధతిని సమన్వయపరచి. బెజవాడలో నున్న రామమోహన ధర్మగ్రంథాలయమందు పదిసంవత్సరములకు పూర్వమే ఈ పద్ధతిని అమలులో పెట్టినారము. ఈ పద్ధతి మిక్కిలి ఉపయోగకరముగా నున్నదని అనుభవమునుబట్టి చెప్పగలము. కావున ఆంధ్రదేశమందలి గ్రంథాలయముల వారందరును అమలులో పెట్టుకొనవచ్చును.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము,
బెజవాడ,
**1—1—1934.**

అయ్యంకి వేంకటరమణయ్య,
కార్యదర్శి.

# వర్గీకరణపద్ధతి.

## మొదటిపద్ధతి.

500 గ్రంథముల కంటె తక్కువగల గ్రంథాలయములకు అనువుగ నుండునది.

అ—సర్వసాధారణ గ్రంథములు (General Books)

క — తత్వజ్ఞానము లేక ధర్మము

చ — శాస్త్రము లేక విజ్ఞానము (Sciences)

ట — సమాజ శాస్త్రము

త — కళలు

ప — వాఙ్మయము

శ — ఇతిహాసము (History)

క్ష — భూగోళము, స్థలవర్ణనము, ప్రవాసము(Travel) మొదలైనవి.

జ్ఞ — జీవ చరిత్రములు (Biography)

---

## రెండవపద్ధతి.

2,000 గ్రంథముల కంటె తక్కువగల గ్రంథాలయములకు అనువుగ నుండునది.

అ — సర్వసాధారణ గ్రంథములు.

- ఎ - బాలురకు పనికివచ్చునవి
- ఐ - స్త్రీలకు పనికివచ్చునవి
- ఔ - ఇతరులకు పనికివచ్చునవి

క — తత్వజ్ఞానము - ధర్మము.

- ఖ - మానసశాస్త్రము - గుప్తవిద్య
- గ - నీతి
- ఘ - మతము (హిందూమతముగాక ఇతర మతములు)
- ఙ - హిందూమతము

చ — శాస్త్రము.

- ఛ - ఆదిభౌతిక శాస్త్రము ( Physical & Chemical Sciences
- జ - జీవశాస్త్రము (Biology)
- ఝ - మానవజాతి శాస్త్రము (Anthrophology)
- ఞ - వైద్యశాస్త్రము

ట — సమాజశాస్త్రము

- ఠ - రాజనీతి
- డ - అర్థశాస్త్రము
- ఢ - వివిధరాజకీయ వ్యవస్థలను గూర్చిన గ్రంథములు
- ణ - శిక్షణ (Education)

త — కళలు

- థ - యుద్ధము సముద్రయానము
- ద - లలితకళలు
- ధ - క్రీడా వినోదములు
- న - సంగీతము

ప — వాఙ్మయము - భాషాశాస్త్రము

- ఫ - అలంకారశాస్త్రము
- బ - కావ్యములు (ప్రాచీనము)
- భ - కావ్యములు (ఆధునికము)

మ - నాటకములు (భరతము ఇత్యాది)
య - నవలలు
ర - గద్య (Essays and commentaries)
ల - భాషాంతరీ కరణములు
వ - వినోదాత్మకములు

శ - ఇతిహాసము - (History)
ష - పౌరస్త్య ఇతిహాసము - (Of Oriental Countries
స - భారతీయ ఇతిహాసము
హ - పాశ్చాత్య ఇతిహాసము
ళ - అమెరికా మొదలైన దేశచరిత్రలు

క్ష - భూగోళము - స్థలవర్ణనము - ప్రయాణ సము

జ్ఞ - జీవచరిత్రలు (Biography)

---

# మూడవపద్ధతి.

2,000 గ్రంథములకంటె ఎక్కువ గ్రంథములు గల గ్రంథాలయములకు అనువుగ నుండునది.

అ (వర్గము) — సర్వసాధారణ గ్రంథములు
అ సర్వసాధారణ గ్రంథములు
ఆ - జ్ఞానకోశములు, నిఘంటువులు
ఇ - మాసపత్రికలు
ఈ - వార్తాపత్రికలు
ఉ - సంఘముల వృత్తాంతములు
ఊ - సర్కారువారిచే ప్రకటింపబడినవి
ఎ - బాలుర గ్రంథములు
ఐ - స్త్రీల గ్రంథములు
ఒ - పుస్తకాలయ సంబంధమైన శాస్త్రము
ఔ - సర్వసాధారణములు నడుమవతిగినవి

క (వర్గము) - తత్వజ్ఞానము - ధర్మము.
క - తత్వజ్ఞానము.
కా - సర్వ సాధారణములు
కి - అధ్యాత్మిక విద్య (Metaphysics)
కీ - తర్కము
కు - దర్శనములు (Systems of Philosophy)
కూ - ఇతర తత్వజ్ఞానమతములు
కె - తత్వవేత్తల చరిత్రలు
కే - వివిధములు

ఖ - మానస శాస్త్రము
ఖా - సర్వసాధారణములు
ఖి - మానవశరీర సంబంధములు (స్వప్నము-చమత్కారము వశీకరణము మోహినిశక్తి మృతసంభాషణ - యోగసమాధి (Hypnotism, Spiritualism) మొదలైనవి)
ఖీ - ఇంద్రజాలము, జారణ మారణములు

గ - నీతి
గా - సర్వసాధారణము
గి - నీతివాదము (Ethical Doctrine)
గీ - రాజనీతి (State Ethics)
గు - కుటుంబనీతి
గూ - వ్యవహారనీతి
గె - జారనీతి (Sexual Ethics)
గే - సమాజనీతి
గొ - విశేషమైన నీతులు (బాల్య వివాహము, బహుపత్నీత్వము, వితంతువుల నిషేధము, ద్యూతనిషేధము, మద్యపానము, నిమ్నజాత్యుద్ధరణము, గౌరాగౌరభేదము (Colour question) మొదలైనవి)

ఘ - వివిధమతములు (హిందూమతము గాక)
ఘా - సర్వసాధారణములు
ఘు - జైనమతము

ఘూ - దివ్యజ్ఞాన సమాజము (Theosophy)
ఘె - పార్సీమతము
ఘే - మహమ్మదీయమతము
ఘో - క్రైస్తవమతము
ఘౌ - అన్యమతములు

ఙ - హిందూమతము
ఙా - సర్వసాధారణములు
ఙి - వైదికమతము (ఉపనిషన్మతము)
ఙీ - స్మార్త
ఙు - శైవమతము
ఙూ - వైష్ణవమతము
ఙె - భాగవతమతము
ఙో - వివిధ సమాజములు (ఆర్యసమాజము, బ్రహ్మసమాజము, నానక మతము, శిక్కు మతము (Etc)
ఙౌ - వివిధములు

## చ (వర్గము) - విజ్ఞాన శాస్త్రములు

చ - గణితము - జ్యోతిషము
చా - సర్వసాధారణములు
చి - అంకగణితము
చీ - బీజగణితము
చు - రేఖాగణితము
చూ - త్రికోణగణితము
చె - ప్లవద్వి -
చో - ఆకాశము
చౌ - జ్యోతిషము

ఛ - ఆదిభౌతిక శాస్త్రము (Physical Sciences)
ఛా - సర్వసాధారణములు
ఛి - పదార్థ విజ్ఞానశాస్త్రము (Physics)
ఛీ - రసాయనశాస్త్రము (Chemistry)
ఛె - ఖనిజశాస్త్రము (Mineralogy)
ఛో - భూస్థలవిద్య (Geology)
ఛౌ - వివిధములు

జ - జీవశాస్త్రము (Biology)
జా - సర్వసాధారణములు
జి - వనస్పతి (Botany)
జు - ప్రాణిశాస్త్రము (Zoology)
జూ - జీవజంతుశాస్త్రము (Enotmology)

ఝ - మానవజాతిశాస్త్రము (Anthropology and Ethnology

ఞ - వైద్యశాస్త్రము
ఞా - సర్వసాధారణములు
ఞి - కాయవిచ్ఛేదనము, కాయధర్మములు ( natomy & Physiology)
ఞీ - చికిత్స (Therapeutics)
ఞు - రోగనిదానము (Pathology)
ఞూ - శస్త్రవిద్య (Surgery)
ఞె - ఆరోగ్యశాస్త్రము (Hygiene and Sanitation)
ఞే - స్త్రీ బాలరోగములు
ఞో - పశురోగములు
ఞౌ - విశేష ఉపచార పద్ధతులు

## ట (వర్గము) — సమాజశాస్త్రము

టా - సామాజిక సంస్థ (Manners & customs
టి - సర్వసాధారణములు
టీ - సమాజ సంస్కరణములు (వ్యక్తివిషయములు)
టు - మద్యపాన నిషేధము మతస్వాతంత్ర్యము, అనేక స్త్రీవివాహము, విధవావివాహము, ప్రౌఢవివాహము మొదలైనవి
టూ - సమాజ సంస్కరణములు (జాతి విషయములు) (జాతిభేద నిషేధము, సంబంధ విషయము మొదలైనవి)
టె - సమాజ సంస్కరణములు (సమాజవిషయములు) నిమ్నజాత్యుద్ధరణ, పరదేశ గమనము, పతితపరావర్తనము, దేవస్థాన సుధారణము, స్త్రీశిక్షణ మొదలగునవి
టే - పరోపకార సంస్థ (అనాథ బాలబాలికాశ్రమములు, సేవాసదనములు, పశురక్షణ శాలలు, రిఫార్మేటరీలు, జైలు సంస్కరణ, అంబులెన్సు, ప్రాథమిక చికిత్స, ఆసుపత్రులు, ఆరోగ్యగృహములు, వగైరాలు
టై - నడవడికలు దుస్తులు, నగలు మొదలైన వాని తరహాలు (Fashions of cloths and ornaments) కర్మకాండలు (Birth and

(death ceremonies,) స్త్రీల సంస్థలు, ఘోషా, జాతిబహిష్కారణ, అనేక పత్నీత్వము, సతి.

ఠ - రాజనీతి
- ఠా - సర్వసాధారణములు
- ఠి - అంతర్ రాష్ట్రీయ స్థానిక వ్యవహారములు (International and Home politics)
- ఠీ - పరరాష్ట్రీయ రాజనీతి
- ఠు - విదేశరాజనీతి
- ఠూ - బ్రిటీషు రాజనీతి
- ఠె - భారతవర్ష రాజనీతి
- ఠై - అమెరికా రాజనీతి
- ఠొ - ఇమిగ్రేషను

డ - అర్థశాస్త్రము
- డా - సర్వసాధారణములు
- డి - ఉత్పన్నము - నిష్పత్తి
- డీ - కార్మికులు, పెట్టుబడిదారులు (Capital and labour) నిర్వ్యాపారాలు (Trade unions etc.
- డు - లాభముల పంపకము (Profit Sharing) సామాన్యస్వామ్యవాదము (Socialism)
- డూ - వ్యాపారము, వరకము, బజారుధరలు Trade Business, etc.
- డె - ద్రవ్యము (Money, Finance, Banking, Interest, etc)
- డే - పన్ను (Taxation,)
- డై - ఆస్థి, భూమి (Property, land, rent)
- డొ - వివిధములు

ఢ - వివిధరాజకీయ వ్యవస్థలు (Government & Law.)
- ఢా - సర్వసాధారణములు
- ఢి - రాజకీయహక్కు, స్వాతంత్ర్యము, స్త్రీ స్వాతంత్ర్యము (Suffrage Movement.)
- ఢీ - రాజశాసన పద్ధతి
- ఢు - ఆంగ్లేయ రాజ్యతంత్రము
- ఢూ - భారతవర్ష రాజ్యతంత్రము
- ఢె - ఇతరదేశ రాజ్యతంత్రములు
- ఢే - చట్టములు, న్యాయశాస్త్రము (Law & Legislation)
- ఢై - వివిధములు

ణ - శిక్షణ (Education)
- ణా - సర్వసాధారణములు
- ణి - ప్రాథమికవిద్య (Elementary Education)
- ణీ - మాధ్యమికవిద్య (Secondary Eduction)
- ణు - ఉన్నతవిద్య (Higher Education)
- ణూ - పారిశ్రామికవిద్య (Technical Education)
- ణె - స్త్రీ శిక్షణ
- ణొ - గృహశిక్షణ (Home Education)
- ణో - ధార్మికవిద్య, నైతికవిద్య, విశిష్ఠవిద్య
- ణై - విశేషశిక్షణపద్ధతులు (Special systems of Education)

## త (వర్గము) - కళలు

త - ఉపయుక్తము (Useful Arts)
- తా - సాధారణములు
- తి - సృత్యక్ష కళలు (Extractive) గనులు మొదలగువానిని త్రవ్వుట, కృషికర్మ, తోటపని. అడవులు, గనులు, సిమెంటు, ఇటుకలు వగైరా
- తీ - రసాయనిక కళలు (Preparation of Chemicals) ధాతువులు, రంగులు, దీపములు, అద్దములు, కుండలు, షరబత్తులు.
- తు - హస్తనిర్మాణ కళలు (Manufacturing) పత్తి, పట్టు, ఉన్ని, తోలు, రబ్బరు, కాగితాలు, వగైరాలు.
- తూ - నిర్మాణ కళలు (Constructive) ఇంజనీరింగు, గృహనిర్మాణము, రస్తానిర్మాణము, పాగబండి నిర్మాణము, ఆనకట్టలు - రేవుస్థలములు (యంత్రీకరణములు).

థ - యుద్ధ, సముద్రయాన కళలు (సంగ్రామవిషయ చరిత్ర, శస్త్రములు, అస్త్రములు, కోటలు, కిల్లాలు, వ్యూహరచన, సేనావిభాగము.)

ద - లలిత కళలు

దా - సర్వసాధారణములు

ది - రమణీయ ఉద్యాన కర్మలు (Land scape gardening)

దీ - గృహశిల్ప కర్మలు. (వాస్తు, (Architecture)

దు - మూర్తి. శిల్పకళలు (Sculpture)

దూ - చిత్రలేఖనము (Drawing) చెక్కడము (Engraving)

దె - రంగులతో వేయు చిత్రకర్మలు (Painting) గృహాలంకారము (Decorating)

దో - ప్రకాశలేఖనము, ఛాయాచిత్రములు (Photography)

ధ - క్రీడావినోదములు

ధా - సర్వసాధారణములు

ధి - సార్వజనిక మనోరంజకములు (నాటకములు, గానములు, సినిమా, తోలుబొమ్మలాట వగైరా)

ధీ - నిలకడగా కూర్చుని ఆడుకొనేవి (బుద్ధిబలముచే ఆడేవి - చదరంగము. పేకాట, చదరంగపాళీ వగైరా)

ధు - తిరుగుచు ఆడుకొనేవి - క్రికెట్టు, ఫుట్ బాల్, కందుకక్రీడ, చెడుగుడి, ఉప్పలపట్టి.

ధూ - వేట, వ్యాయామ విద్యలు, పోలో మొదలైనవి.

న - సంగీతము

నా - సర్వసాధారణములు

ని - కీర్తనలు

ను - వాద్యములు

నె - నర్తనము

నొ - పాశ్చాత్య సంగీతము

నో - సంగీతోపకరణములు

ప వర్గము — సాహిత్యము - వాఙ్మయము

ప - భాషాశాస్త్రము

పా - సర్వసాధారణములు

పి - హస్తలిపి - (Hand writing)

పీ - ఉత్పత్తి

పు - శబ్దకోశము (Vocabulary)

పూ - వ్యాకరణము

పె - ఛందస్సు (Prosody)

పై - గ్రంథరచన (Composition)

పొ - సాదృశ్యభాషాజ్ఞానము (Comparative knowledge)

పో - భాషాంతరీకరణము

ఫ - అలంకారశాస్త్రము

బ - కావ్యము (ప్రాచీనము) ఆధ్యాత్మికములు

బా - సర్వసాధారణములు

బి - అతిప్రాచీనములు

బీ - మధ్యకాలమునాటివి

బె - ఆధునికములు

బొ - యాలపాటలు, యక్షగానములు వగైరా (Ballards and Bardic literature)

భ - కావ్యములు (ఆధునికములు) రసికములు

మ - నాటకములు

మా - పద్యనాటకములు

మి - గద్యనాటకములు

ము - సంగీతనాటకములు

మె - భాషాంతరీకరణములు

య - నవలలు

యా - చమత్కారకథలు

యి - సామాజికకథలు

యు - ఐతిహాసికములు

యె - పరిశోధకములు, దోష అవిష్కారకములు

యో - ఇతరములు

ర - గద్యవాఙ్మయము (నిబంధనలు, టీకలు, Etc.)

రి - నిబంధాత్మకములు

రీ - వక్తృత్వము

రె - టీకాత్మకములు

రా - వ్యాససంగ్రహములు

ల - భాషాంతరీకరణ వాఙ్మయము (సమూలములు, మూలములేనివి)

లా - సాధారణములు

లి - సంస్కృతమునుండి

లు - దేశభాషలనుండి

లె - పాశ్చాత్యభాషలనుండి

లో - పౌరస్త్యభాషలనుండి (Oriental languges)

వ - వినోదాత్మక వాఙ్మయము

**శ - శ (వర్గము) ఇతిహాసము**

శ - సామాన్య ఇతిహాసము

శా - సర్వసాధారణములు

శి - ప్రాచీనవస్తుపరిశోధనము (Archdelogy)

శీ - ఇతిహాసిక స్థలములు

శు - ప్రాచీన ఇతిహాసము

శూ - కట్టుకథలు, పుక్కిటిపురాణములు (దంతకథలు) ఆఖ్యాయికలు

శె - వంశావళులు

శే - ఐతిహాసిక పరివర్తనము (సంస్థలు)

శో - ఆధునిక ఇతిహాసము

శౌ - వివిధములు, వ్రాతకాగితములు, తాళపత్రములు

ష - పౌరస్త్య ఇతిహాసము (History of Oriental Countries)

షా - సాధారణములు

షి - చీనా

షీ - జపాను

షు - జ్యూ

షూ - ఇరాన్, బాబిలోనియా

షై - ఆఫ్రికా

షో - ఈజిప్టు

షౌ - ఇతరదేశములు

స - భారతీయ ఇతిహాసము

సా - సర్వసాధారణములు

సి - వైదికయుగము

సీ - బౌద్ధయుగము (గ్రీకు, సింధియను)

సు - మొగలు యుగము

సూ - మహారాష్ట్రయుగము

సె - ఆంగ్లయుగము

సౌ - వివిధరాష్ట్రముల చరిత్రలు

హ - పాశ్చాత్య ఇతిహాసము

హా - సర్వసాధారణములు

హి - గ్రేటుబ్రిటను, అమెరికా, కనడా, మెక్సికో

హీ - ఫ్రాంసు, హాలండు, స్విట్జర్లాండు

హు - జర్మని, ఆస్ట్రియా, హంగెరీ

హూ - రోమనుసామ్రాజ్యము ఇటలీ

హె - స్పెయిను, పోర్చుగల్, గ్రీసు

హై - నార్వే, డెన్మార్కు, స్వీడను, రష్యా, బాల్కనురాష్ట్రములు

హు - ఉత్తర, దక్షిణ ధ్రువములు

హౌ - వలసబోయినవారి చరిత్ర

ళ - ఆంధ్రదేశచరిత్ర

ళ - ఆంధ్రదేశ వర్ణన, మొత్తముమీద

ళి - శాతవాహనయుగము

ళు - పల్లవ, చాళుక్య యుగములు

ళూ - కాకతీయ, రెడ్డియుగములు

ళె - విద్యానగరసామ్రాజ్యయుగము

ళో - మహమ్మదీయయుగము

ళౌ - పాశ్చాత్యయుగము

**క్ష - భూగోళము, స్థలవర్ణనము, ప్రవాసము (Travel)**

క్షి - మార్గదర్శక పుస్తకములు (Guides) గెజటీర్లు, దేశపటములు (Maps)

క్షీ - యూరోపాఖండము

క్షు - ఆసియాఖండము

క్షూ - ఆఫ్రికాఖండము

క్షె - భారతదేశము

క్షే - అమెరికాదేశము

క్షో - ఆంధ్రదేశము

క్షౌ - ఇతరదేశములు

**జ్ఞ - జీవచరిత్ర - (Biography)**

జ్ఞా - సర్వసాధారణములు

జ్ఞి - అవతార పురుషుల చరిత్రలు

జ్ఞీ - ప్రాచీనఋషులు, సాధువులు, తత్త్వవేత్తలు, జ్ఞానులు

జ్ఞు - అమాత్యులు, ముసద్దీలు

జ్ఞూ - వీరుల కథలు

జ్ఞె - కవులు విద్వాంసులు

జ్ఞో - ఆంధ్రదేశస్థ స్త్రీ పురుషుల చారిత్రలు

జ్ఞౌ - స్త్రీలచరిత్రలు

# ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, బెజవాడ.

## ఉద్దేశములు.

౧. ఆంధ్రదేశమున ధర్మగ్రంథాలయోద్యమము నభివృద్ధిచేయుట. ఈక్రింద వివరింపబడిన సాధనములవలనను అందులకు విరుద్ధము కాని ఇతరసాధనములమూలముననను ఈ యుద్యమాభివృద్ధి గావింపబడును :—

(క) బెజవాడ పట్టణమున ఆంధ్రదేశమున కంతకును కేంద్రగ్రంథాలయమును నిర్వహించుట.

(చ) ఆంధ్రదేశమున స్థాపింపబడునట్టియు, తదితరదేశములయందు ఆంధ్రులచే స్థాపింపబడునట్టియు - ధర్మగ్రంథాలయ సంఘములను, పఠనమందిరములను ఈ సంఘమునకు చేర్చుకొనుట, అట్టివానిని స్థాపించుట.

(ట) "మాజిక్కు లాంతరులు" "సినిమెటోగ్రాఫులు" "బయాస్కోపులు" మున్నగు యంత్రసామగ్రిని సేకరించి తన్మూలమున జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధిని కలుగజేయుట.

(త) సంచార గ్రంథాలయములను నెలకొల్పి వానిని ఆంధ్రదేశమునం దంతటను పంపి తన్మూలమున జ్ఞానాభివృద్ధిని గలుగజేయుట.

౨. ఆంధ్రదేశమునందును తదితరదేశములయందును శక్తికొలదిని ధర్మగ్రంథాలయోద్యమమునుగూర్చి జ్ఞానమును వ్యాపింపజేయుట.

౩. ఆంధ్రసారస్వతమునందలి గ్రంథములన్నిటికిని ప్రత్యేకప్రాముఖ్యముతో ఇతర గ్రంథరాజము లన్నిటికినిగూడ పనికివచ్చెడి గ్రంథవిభజనపట్టికను తయారుజేసి ప్రచురించుట.

౪. (క) జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధినొందుటకుగాను జ్ఞానాభివృద్ధికరములగు గ్రంథములు, కరపత్రములు మొదలగువానిని ప్రచురించుట.

(చ) జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధికి సాధనములుగానుండు జాతీయ సంస్థాపనలను కాలానుసరణములగునట్లు ఉద్ధరించుట.

౫. ఆంధ్రజాతీయ వికాసమునకును, ఆంధ్రవ్యక్తివికాసమునకును సాధనభూతములగు సారస్వతము, విద్య, చిత్రకళలు, చరిత్రపరిశోధన, మానవసేవ - మున్నగు పరమార్థకార్యములను చేయుట.

౬. ఈ సంఘముయొక్క ఉద్దేశములను గలిగిన ఇతర ప్రతిష్ఠాపనలతో కలిసి పనిచేయుట, అట్టి వానితో సంబంధమును కలుగజేసికొనుట.

మీ కేమైన గ్రంథాలయ సేవ కావలసిన ఇట్లు వ్రాయుము :—

**ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, బెజవాడ.**